---

# ఆమె మనోహర సొగసుకు రహస్యం

## సింథాల్‌యందలి జి-11 (హెక్సాక్లోరోఫీన్)

మనోహర సొగసు, విస్మయకర
మైన చర్మ సౌందర్యం-పరిపూర్ణమైన
మనోభావం-ఆత్మ విశ్వాసం,
మీ సమీపమున వుండగోరే అభిలాష.



సింథాల్‌యందు గల జి-11,
(హెక్సాక్లోరోఫీన్) మత్పలము
విరోధించును. శరీర దుర్గంధమును
తొలిగించును. మిమ్ములను రోజల్లా
హాయిగొలిపే ప్రకాశరూపంగా
ఉంచును.



మరి దృఢమైన నమ్మకతో-రోజల్లా హాయిగొలిపే పరిశుభ్రంగా నుండుటకు జి-11 (హెక్సాక్లోరోఫీన్) గల సింథాల్ సబ్బును మరియు టాయిలెట్ పౌడర్‌ను వాడండి.

జి-11, ఎల్. శివాజా ఎట్ సీ. ఎస్. ఎ. వారి ట్రేడ్ మార్కు.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# నవలల పోటీ!

## మొదటి బహూమతి రు.3,500
## రెండవ బహూమతి రు.1,500
## మూడవ బహూమతి రు.1,000

ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకి మరింత మంచి సీరియల్ నవలలని అందచెయ్యాలనే ఉద్దేశంతో పై పోటీని నిర్వహిస్తున్నాము. రచయిత(త్రు)లందరూ ఎప్పటివలె మాతో సహకరించి పై పోటీ జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

**ముగింపు తేదీ: 31-12-1966**

### నిబంధనలు

1. పోటీకి స్వంతరచనలే పంపాలి. పంపే రచనలు తమ స్వంతమయినవే ననీ, అనువాదాలుకాని, అనుసరణలుకాని కాదని రచయిత(త్రు)లు వ్రాతప్రతితో బాటు హామీ పత్రాలు పంపాలి.
2. రచనలు కాగితానికి ఒకవైపునే, సిరాతో రాసిఉండాలి. 100అరఠావు (ఎక్సర్సయిజు పుస్తకం పేజికి రెండురెట్లు) పేజీలు తోపు,300 అరఠావు పేజీలు మించి ఉండరాదు.
3. నవలలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.
4. వ్రాతప్రతులు 31—12—1966 లోపల మా కార్యాలయం చేరాలి.
5. వ్రాతప్రతులు, 'సంపాదకుడు ఆంధ్రసచిత్ర వారపత్రిక, తంబు చెట్టి వీధి, మద్రాసు—1,కి పంపాలి.
6. కవరు మీద, వ్రాతప్రతి మీద 'నవలల పోటీ—1966' అని స్పష్టంగా రాయాలి.
7. పోటీలో నెగ్గని నవలలు ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురించే హక్కు మాకు ఉంది.
8. పోటీలో నెగ్గని, ప్రచురణకి స్వీకరింపబడని నవల వ్రాతప్రతులని వీలయినంత త్వరలో, సురక్షితంగా రచయిత(త్రు)లకి తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని ఈ విషయంలో ఎటువంటి బాధ్యతనీ వహించలేము, హామీ ఇవ్వలేము. వ్రాతప్రతులతో బాటు తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామా కల కవర్లు జతపరచటం అవసరం.
9. పోటీలో తుదినిర్ణయం సంపాదకునిదే. ఈ విషయమయి ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలూ జరుపబడవు.
10. ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురణపూర్తి అయిన తర్వాత పుస్తక రూపంలో నవలని వెలువరించగోరేవారు పుస్తకంలో ప్రముఖంగా 'ఆంధ్రసచిత్ర వారపత్రిక నుంచి పునర్ముద్రితం' అని పేర్కొనాలి.

# ఉత్తరాలు

### కథలు

'కామేశ్వరి గారు రచించిన "తెల్లవారింది" కథ చాలా బాగున్నది. యుద్ధ ఘట్టాలు చాలా సహజంగా రచించారు.

మేజర్ సహాని శరీరం షెల్లింగ్‌లో తుత్తునియలయిపోయింది. కెప్టెన్ చౌదరి స్ట్రాపింగ్‌లో బంకర్లోనే ప్రాణాలు విడిచాడు. లెఫ్టినెంట్ అర్జునసింగ్ మైన్ మీదకాలు పెట్టగానే కాలు ఎగిరిపోయింది. ఇలాంటి విషయాలు రేడియోలు గాని, పేపర్లు గానీ ప్రచారం చేయవు. అవన్నీ అసహజంగా వున్నా కథ చాలా బాగుంది.

భానుమతీ రామకృష్ణగారు వ్రాసిన "అత్తగారు అంతరాత్మ" బాగుంది. వారికి నా అభినందనలు.

కుమారి పి. శకుంతలగారు వ్రాసిన "కథ తెచ్చిన వ్యథ" కూడా చాలా బాగుంది.

ఆశీర్వాదము జె. డి.
1326381: 130 కన్స్ట్రక్షన్ కంపెనీ,
651 డెట్, కేరాఫ్ 99 ఏ. పి. ఓ.

* * *

పింగళి సుశీలాదేవిగారు వ్రాసిన 'తొలగినె తెరలు' కథ చాలా బాగుంది.

జి. బసవరాజు (ధర్మవరం)

### వ్యాసాలు

ఈ వారం 2—9—66 ఆంధ్ర సచిత్ర వారపత్రిక మాకెంతో సంతోషాన్ని కలిగించింది. అందుకు కారణం, ఇటీవల లండన్‌లో జరిగిన ఒక ప్రదర్శన గురించి ఎస్. వి. రామారావు గారు వ్రాసిన వ్యాసం, మన అభిమాన రచయిత్రి శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ అన్నపూర్ణావారి 'పూలరంగడు'కి సంభాషణలు సమకూరుస్తున్నారన్నవిషయం, దర్శకుడు ఆదుర్తి, నటుడు నాగేశ్వరరావు కలసి ఒక చిత్రనిర్మాణ సంస్థను నెలకొల్పారన్న విషయం సదరు సంచిక ప్రతికలో ఉండటమే! కాని ఈ వారంతో మౌల్వీ నసిరుద్దీన్ కథలు అయిపోయాయనగానే మాకు 'అదోలా' అనిపించింది."

ఎస్. వి. ఎస్. ఎస్. మూర్తి.
'సాగర్' బరంపురం.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 14—10—'66
పరాభవనామ సం॥ భాద్రపద మాసం బ॥ [illegible]
సంపుటము : 59 సంచిక : 5

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1


క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

భారత దేశం

| | పోస్టుద్వారా రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 32.00 |
| అర్ధసంవత్సర చందా | 16.00 |

# మనలో మాట

ఈ సంచికలో నవలల పోటీ ప్రకటన ఒకటి వేశాము. రచయితలూ, రచయిత్రులూ ఎప్పటివలె ఇందులో పాల్గొని దానిని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము!

* * *

వీలయినంతవరకూ ప్రతి సంవత్సరం కొన్ని తేదీల సందర్భంలో కొందరు మహానాయకులమీద నిస్సారమయిన వ్యాసాలు వెయ్యకుండా ఉండటమే మంచిదని మా అభిప్రాయం. కాని, ఇంగ్లీషులో మంచి కవిగా పేరు సంపాదించుకున్న యువ రచయిత డామ్ మోరేస్, గాంధీగారిమీద రాసిన వ్యాసం ఒకటి ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఇది వివాదాస్పదం కాగలదనటంలో అతిశయోక్తి లేదేమో...

* * *

వచ్చేవారం ఆంధ్రసచిత్ర వారపత్రిక వనితల ప్రత్యేక సంచికగా వెలువడుతుంది...

* * *

30—9—66 ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురించిన 'దేశం కోసం' కథ అంకితం 'మమ్ము విడిపోయిన మా సోదరుడు ఫ్లైట్ ఆఫీసరు గోపికి' అని రచయిత్రి శ్రీమతి డి. కామేశ్వరి రాశారు...

# విషయానుక్రమణిక

ముఖచిత్రం: 'ప్యార్ కియే జా'లో కల్పన



స్వప్నలోకంలో
నాలవ ప్రణాళికకు విదేశీ సహాయం
మేల్కొల్పిన యదార్థం
ప్రజల కష్టాల ద్వారా మనోవేదన
చైనా దేశంలో ఘనమైన అభ్యుదయ సాధన
హాఁ - హాఁ! ఇది నాకు వచ్చే ఎన్నికల్లో ఆశ చూపెడుతోంది!
ఆంధ్రలో కాంగ్రెసు కలతల, పరంపర
ఆంధ్రలో కమ్యూనిష్టులు
నెమిసెస్ మాత్ త్వరలో చౌ-ఎన్-లై స్థానాన్ని ఆక్రమిస్తారు!
OOMMEN

# ప్రణాళికలు - పరిశ్రమలు

### విశాఖపట్నంలో ఉక్కు కర్మాగారం సమస్య:

ప్రజల క్షేమం కోరి ప్రయోజనమైన కృషి చేయాలని కాంగ్రెసుపార్టీ కోరుకుంటూ వుంది. ఆంధ్రనాయకులు ఉక్కు ఫ్యాక్టరీ కోసం వత్తిడి చేస్తున్నారు. ఈసమస్యను పరిష్కరించడం కోసం ఎన్నోవిధాలు అవలంబించబడ్డాయి. ఇదివరలో ఆంగ్లో అమెరికన్ కన్సార్టియమ్‌వారు ఈ లక్ష్యం పైన పరిశోధించి వున్నారు. ఒక ఖచ్చితమైన అభిప్రాయాన్ని ప్రభుత్వం ప్రకటించలేదు. రాజకీయ చదరంగంలో ఎన్నికల దృష్ట్యా విశాఖపట్టణానికి ఈఉక్కు ఫ్యాక్టరీ నెలకొల్పేందుకు ఎక్కువ అవకాశం వున్నట్లు ప్రభుత్వం ఇదివరలో తెలియపరచి వుంది. అది కార్యరూపం ధరించే సరికి ఎన్నిపరిణామాలు రాబోతున్నాయో, ఎంతకాలం పడుతుందో తెలియదు. ఐదవ పంచవర్ష ప్రణాళికలో మొదటిరెండు సంవత్సరాల్లోనైనా ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణం ఆలోచనలు రూపుదాల్చి ఉత్పత్తి ప్రారంభించినట్లయితే ఆంధ్రదేశం ఆశలు ఫలిస్తాయి. మనదేశ ఆర్థిక పరిస్థితి కూడా అంతంత మాత్రంగానే వుంది. ఇప్పటి ఉత్పత్తిని సాధిస్తున్న బొకారో ఉక్కు కర్మాగారం, తదితరాలైన భిలాయ్, రూర్కేలా, దుర్గాపూర్‌లలోని కర్మాగారాలకు వాటిని విస్తృతం చేసేందుకు ఎక్కువ కేటాయింపులు జరిగే వున్నాయి. నూరుకోట్ల రూపాయిలకు మాత్రమే క్రొత్త ఉక్కు కర్మాగారం పరిమితమై వుంటుంది. మిలియన్ టన్నుల ఉక్కు కర్మాగారానికి ఈ కేటాయింపు చాలనే చాలదు.

విశాఖపట్టణంలో ఉక్కుకర్మాగారాన్ని స్థాపించడం విషయంలో ప్రభుత్వం త్వరలో ఒక ప్రకటన చేయాలని ఈ తరుణంలో ఆంధ్రనాయకులు పట్టుబట్టాల్సిన అవసరం ఎంతైనా వుంది. ఈ ప్రణాళికలో విశాఖపట్టణంలో ఉక్కుకర్మాగారం చోటు చేసుకోవాలి. అందుకు ఇప్పుడే గట్టి ప్రయత్నం చేయాలి. చేయి జారింతర్వాత విచారిస్తే ప్రయోజనమేమీ వుండదు. అంతే కాకుండా ఆంధ్రదేశాన్ని పారిశ్రామికీకరణం చేయడానికిగాను నూరుకోట్ల రూపాయిలు, ప్రణాళిక కేటాయించడాన్ని ఆంధ్ర నాయకులు పరిశీలించాలి. ఈ విధమైన కేటాయింపు ఆంధ్రప్రాంతాన్ని పారిశ్రామికం చేయడానికి, తద్వారా నిరుద్యోగ సమస్యను చక్కబరిచేందుకు దోహదకారి అవుతుంది.

ఐదవ ఉక్కుకర్మాగారం విషయం ఆలోచించినట్లయితే ఆంధ్రను పారిశ్రామికంగా అభివృద్ధి చేసే లక్ష్యంపై నూరుకోట్ల రూపాయిల కేటాయింపుతో సంతృప్తి చెందినా ఫరవాలేదు. ఒకవేళ విశాఖపట్టణంలో ఉక్కుకర్మాగారం విషయం ప్రకటించబడినా ఆ నూరుకోట్ల రూపాయిలు నాలుగో ప్రణాళికలోనే ఖర్చు పెడతారు అనుకోవడం పొరబాటు. ఉక్కుకర్మాగారం స్థాపనతో మనం చాలవరకు పురోగమిస్తామనడం నిజమే. అయినా, అదే ప్రధాన లక్ష్యంగా కాకుండా ప్రాంతీయవారీ అభివృద్ధి పథకాల కోసం పారిశ్రామికీకరణం కోసం నియమితమైన కేటాయింపును గురించి కూడా మనతో మనం ఒకసారి ఆలోచించుకోవడం కూడా మంచిది. బొకారో ఉక్కుకర్మాగారం ఈ విషయంలో మనకు చక్కని పాఠం చెప్పగలదు.

### ఎన్నికల తర్వాత కాంగ్రెసు పరిస్థితి

రాబోయే సాధారణ ఎన్నికల తర్వాత కూడా ప్రభుత్వ కార్యాలయాలపై కాంగ్రెస్ జెండా ఎగురుతుందన్నమాట తథ్యం. అంచేత, ప్రజల్లో కాంగ్రెసు పరపతి బాగా వుందనిగాని, కాంగ్రెసు మీద ప్రజలకు అమితమైన అభిమానం వుందనిగాని చెప్పడానికి వీల్లేదు. మరో బలమైన ప్రతిపక్షం లేకపోవడమే దీనికి కారణం. పశ్చిమ ప్రజాపాలిత రాజ్యాల వలె మనదేశంలో పటిష్టమైన ప్రతిపక్షం లేదు. ఉన్న ఒక్క కమ్యూనిస్టు పార్టీలో కూడా అనేకం చీలికలున్నాయి. సోషలిస్టులుగాని స్వతంత్ర పక్షాలుగాని అంతమాత్రంగానే వున్నాయి. ప్రతిపక్షాలన్నీ సమైక్యమై ఒక త్రాటి మీద నిలబడితే తప్ప కాంగ్రెసుకు అపజయమనేది లేనేలేదు. జైపూర్ మహారాణి గాయత్రీదేవి స్వతంత్రపార్టీ సభ్యురాలైతే, బికనీర్ మహారాజా ఇండిపెండెంట్ సభ్యులు. ఇలా వుంది ప్రతిపక్ష పరిస్థితి.

వచ్చేఎన్నికల తర్వాత రెండువిధాలైన మార్పు రావడానికి ఆస్కారముంది. అది, లోక్‌సభలో కాంగ్రెసు బలగం తగ్గిపోవడం ఒకటి, ఇప్పటి కేంద్రమంత్రి వర్గంలోని మంత్రులు తగ్గింపబడడం రెండవది.

మరో సత్యమేమిటీ అంటే, మొరార్జీ దేశాయ్‌గారు మళ్లీ కాంగ్రెస్ పార్టీ నాయకత్వానికి నిలబడడం. మరోసారి శ్రీమతి ఇందిరాగాంధి నెగ్గుతుందా అనేది ఒక పరీక్ష. పార్టీలోని వివిధ వ్యతిరేక శక్తులవల్ల శ్రీమతి ఇందిరాగాంధి బలం తగ్గడానికి అవకాశం వుంది. మొన్నమొన్నటి పార్లమెంటు సమావేశంలో కూడా ఆమెకుగాని ఆమె ప్రధాన సలహాదారులకుగాని తగినంత ప్రాపు లేకపోయింది అనేమాట ఆధార రహితమైందేమీ కాదు. మధూలిమాయే గారు నిర్వహించిన పాత్ర ఇందుకు సరియైన ఉదాహరణ. క్రొత్త పార్లమెంటులో కూడా ఈ దాడి మరింతగా విజృంభిస్తుందనుకోవడం బేసబబు కాదు. ఇప్పుడున్న పరిస్థితిని బట్టి లోక్‌సభలో ముఖ్యమంత్రుల ప్రభావం కూడా అధికంగా వుండడానికి కూడా మరింత అవకాశం వుంది.

ఇప్పుడు కాంగ్రెసు ఎదుర్కొనబోయే మరో తీవ్రమైన పరిస్థితి ఒకటి ఏర్పడుతోంది. ఇప్పటి ప్రభుత్వ వ్యవహారాలని పరిశీలించి చూసినట్లయితే, ఈ విధానాన్ని బట్టి రెండుమూడు రాష్ట్రాలు ప్రతిపక్షాల పరం అయ్యేందుకు అవకాశం వుంది. ఆ రాష్ట్రాలు కమ్యూనిస్టు పక్షానికిగాని స్వతంత్ర పక్షానికి గాని అర్పితమవుతాయి. నేటి కేంద్రప్రభుత్వం యొక్క పక్షపాతం, కొంతవరకు జాత్యభిమానం, ఇటువంటి చీలికలకు కారణమవుతూ వుంది. ఒక విధంగా ఇటువంటి వేర్పాట్లు జరిగితేనేగాని కాంగ్రెసు పరిపాలనలోని లోటుపాట్లు బయటపడవు. శ్రీమతి ఇందిరాగాంధి ఎప్పుడో చెప్పారు, క్లిష్ట పరిస్థితుల నెదుర్కోవలసిన సమయం వస్తున్నదని. నేటి ప్రభుత్వ పాలనను _ పరిదిద్దేందుకు రేపు

కాదో ప్రతిపక్ష పాలన ఎంతవరకు దృష్టాంతం కాగలదో చూద్దాం!

**నూనె శుద్ధి కర్మాగారాలు విదేశీ సహాయం:**

మద్రాసులో అణుశక్తి కేంద్రానికి ఫ్రాన్సువారి ఆర్థిక సహాయం సంపాయించి పెట్టడంలో కృతకృత్యులైనారు కీర్తిశేషులు డా. హోమీ బాబా. కాని, భారత ప్రభుత్వం అన్నది, ఈ అణుశక్తి కేంద్రాన్ని కెనడా వారి సాంకేతిక సహాయం మీద నెలకొల్పుతాము అని. ఫ్రాన్సు అందుకు అంగీకరించలేదు. అందుకా ప్రతిపాదన వీగిపోయింది.

పెట్రోలియం మంత్రిత్వశాఖ సందు చేసుకుని ఈ అవకాశాన్ని వినియోగించు కున్నది. హాల్దియా నూనె శుద్ధి కర్మాగారం స్థాపించడం కోసం 2.5 మిలియన్ల విదేశీ ద్రవ్యాన్ని ఫ్రెంచి ప్రభుత్వం నుంచి కోరింది. ఈ నియమిత భావ వాదంతో మద్రాసును ప్రక్కకు నెట్టి జెంగాలు ఫలితాన్ని పొందుతుంది!

ఈ విషయంలో మనకు కొట్టొచ్చి నట్టు కనిపించే దేమిటంటే శ్రీ పి. ఆర్. నాయక్ అజమాయిషీలో పెట్రోలియం మంత్రిత్వశాఖ యొక్క ఉత్సాహమైన కృషి. హాల్దియా కర్మాగారం నూనెశుద్ధి కోసమే ప్రత్యేకింపబడకుండా ఎరువుల ఉత్పత్తి కేంద్రంగా కూడా పరిగణింప బడుతుంది, ఇటువంటి ఏర్పాటు అస్సాము, బీహారు, గుజరాత్, కొచ్చిన్‌లలో గల రిఫైనరీలలోనూ లేదు. దీనికి కారణం అపరిమితమైన 'నేఫ్తా' సమస్య. ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్‌కు చెందిన శ్రీ యస్. యస్. కాశ్యప్ ఈ 'నేఫ్తా' సమస్య నూనె పరిశ్రమల అభివృద్ధికి ఆటంకమై వుందన్నారు. ఇది త్వరలో అరవైవేల టన్నులకు పెరిగే అవకాశం కూడా వుందని ఆయన అన్నారు. గుజరాతులోని పెట్రో రసాయనిక మిశ్రపరిశ్రమ ఉత్పత్తి సకాలంలో ప్రారంభించని కారణంగా 'నేఫ్తా' మిగులు ఏర్పడిందని ఆయన అన్నారు. కొన్ని ఆదర్శాల మీద నిలబడ్డ పండిత కె. డి. మాలవీయ మంత్రిత్వం ఈ పరిశ్రమకు కావలసిన సాధనసామగ్రిని అందివ్వలేకపోయిందని ఋజువవుతూనే వుంది. అమెరికా వ్యాపారం మనదేశంలో విపరీతంగా అభివృద్ధి చెందుతూ వుంది. ఇప్పటి ప్రభుత్వ, ప్రయివేటు రంగాలు ఇందుకు తార్కాణం. ఇటీవలి పరిశీలనల ద్వారా తేలుతున్నదేమిటి అంటే, ఈ 'నేఫ్తా' సమస్య ఏ యితర దాక్ష్యాల అవసరం లేకుండా మనకు మనమే పరిష్కరించుకో గలము అని. ●

# భారత భాగ్యవిధాత బాపూజీ

## డామ్ మొరేస్

వేరొకవిధంగా చూస్తే ఆయన వృద్ధాప్యంలో మరణించారని చెప్పుకోవాలి. ఎందుకంటే 1948 నాటికి ఆయన జీవితంలో సాధించాల్సిన పని పూర్తి అయింది. ఆయన నడిపించిన జాతీయ వుద్యమంలోని పిన్నవయస్కులు ఆయనను రాజకీయవేత్తగా పరిగణించటానికి బదులు పవిత్రమైన స్మృతి చిహ్నంగా చూడనారంభించారు. రైతులను మోసం చేసివారిని వెళ్ళగొట్టే భూస్వాముల ఇళ్ళల్లో, అప్పులుయిచ్చేవారి కార్యాలయాల్లో, పాపభీతిలేని వర్తకుల దుకాణాల్లో హిందూ దేవుళ్ళ పటాల ప్రక్కన ఈ వృద్ధుని ఛాయాచిత్రం వ్రేలాడుతూ వుంటుంది. ఆయన అదృష్టాన్ని తెచ్చిపెట్టే రక్షరేకుగా తయారైనారు. మూఢ విశ్వాసంతో ప్రజలు ఆయనను స్మృతిపథంలో వుంచుకుంటున్నారు. ఆయనపేరును పవిత్రత వెదజల్లు నామంగా భావిస్తున్నారు. ఆయన పేరు ఎంతోవుజ్వలంగా ప్రకాశిస్తున్నది. కాని ఆయన చూపించిన మార్గాన్ని ఎవరూ అనుసరించటం లేదు. ఆయనకు అత్యంత సన్నిహితుడైన శిష్యుడు స్వర్గీయ శ్రీ నెహ్రూ కూడా గాంధీజీ మార్గాన్ని అనుసరించలేదు. గాంధీ మరణించిన తర్వాత కొన్ని సంవత్సరాలకు ఇటువంటిపరిస్థితులలో గాంధి ఏంచేసివుండేవారో ఆలోచించి మరీ రాజకీయ నిర్ణయాలను తీసుకుంటున్నారా, వాటిని ఆచరణలో పెడుతున్నారాఅని ప్రశ్నించగా శ్రీనెహ్రూ 'లేదు' అని ముక్తసరిగా ఖచ్చితంగా జవాబిచ్చారు.

గాంధి మధ్యభారతంలోని పేరు ప్రఖ్యాతులులేని ఒకచిన్న సంస్థానం కతియవార్‌లో జన్మించారు. ఆయనస్థానిక 'ప్రధాని' పుత్రుడు. తన తండ్రిని గురించి ఆయన యిలా వ్రాశారు. "ఆయన తన వారిని ప్రేమించేవారు." సత్యానికి కట్టుబడి వుండేవారు. ధైర్య సాహసాలు, వుదారబుద్ధికల వ్యక్తి కాని ఆయన ముక్కోపి. కొంతవరకు ఆయన ఇంద్రియ లోలుడు కూడా అని చెప్పుకోవచ్చును. "గాంధిజీ ఆతండ్రికిపుట్టిన కొడుకే. సనాతన హిందూసంప్రదాయాన్ని అనుసరించి పదమూడుసంవత్సరాల వయస్సులో ఆయనకు కస్తూరిబాయ్‌తో వివాహం జరిగింది. ఆమె ఆయనయందు ఎంతో విశ్వాసాన్ని కనబరిచేది. ఆయనజీవితంలో చాలా రోజులపాటు ఆమె ఆయన సహచారిణిగా నైరాశ్యాన్ని అనుభవించిదేమో అనిపిస్తున్నది. "భర్తగా అధికారాన్ని నెలయించటానికి నేను అట్టే రోజులు ఆగలేదు." అని గాంధిచెప్పారు. ఆయనకు ఆమెఅంటే అసూయ వుండేది. కామాంధుడైన భర్తగా వుండేవాడనని ఆయన చెప్పుకున్నారు. కస్తూరిబాయికి చదువు నేర్పాలనుకున్నారుకాని భోగలాలసత్వం తనకు తీరిక లేకుండా చేసిందని ఆయన చెప్పారు. ఆయన పదహారవ సంవత్సరంలో ఒక సంఘటన జరిగింది. ఈసంఘటన ఆయన జీవితంపై తీవ్రమైన ప్రభావాన్ని చూపించింది. అప్పట్లో ఆయన తండ్రికి చాలా జబ్బుగావున్నది. గాంధితండ్రికి కాళ్ళుపట్టి ఆయనకు బాధ తగ్గించేవారు. ఒకనాడు ఆయన ఈపనిని తన పినతండ్రికి అప్పగించి పడకగదికి వెళ్ళారు. అక్కడ ఆయనభార్య నిద్రపోతూవున్నది. "నేనుఅక్కడ వుండగా ఆవిడ ఎలా నిద్రపోతుంది? నేను ఆమెను లేపాను" అని గాంధి వ్రాశారు. కొన్ని నిమిషాల తర్వాత ఒక నౌకరువచ్చి తండ్రి మరణించినట్టు గాంధికి విన్నవించాడు.



1944 సెప్టెంబర్ 29 న వార్ధాలో జరిగిన సంస్థాన ప్రజామండల్ సమావేశంలో పాల్గొన్న గాంధీజీ, శంకర్రావ్ దేవ్, సర్దార్ పటేల్ శ్రీమతి సరోజినీ నాయుడు, అధ్యక్షత వహించిన జవహర్‌లాల్ నెహ్రూ, రాజేంద్రప్రసాద్ మొదలయినవారు

ఈప్రకారం ఇరవై సంవత్సరాలపాటు గాంధి మనస్సు క్షోభ చెందింది. చివరకు 1906లో ఆయన ఇంద్రియాసక్తిని విడిచిపెట్టి బ్రహ్మచర్యాన్ని అవలంబించడానికి ప్రతిన తీసుకున్నారు. అటుపైన ఆయన తన భార్యతో సోదరితో ఎలా వుంటారో అలా వుండేవారు. ఆయన ఈ ప్రతిన తీసుకున్నానాటికి ఆమె ఇంకా చిన్నదే. ఆమె విషయంలో తాను క్రూరంగా ప్రవర్తిస్తూవుండే వాడనని సందేహం అనుమానం ఆయనకు రాలేదు. తన ఆత్మ

# బాపూజీ

కథలో ఆయన ఇటువంటిదే మరొక విచిత్రమైన వృత్తాంతాన్ని పొందుపరిచారు. ఆయన తాను మరణిస్తే తనకుటుంబానికి డబ్బు చెందేట్టు జీవితభీమా పట్టాను తీసుకున్నారు. తర్వాత ఆయన ఈ విషయమై పశ్చాత్తాపాన్ని ప్రకటించారు. "నిజానికి అసలు రక్షకుడు భగవంతుడు. నా జీవితాన్ని భీమా చేసి నా భార్య, పిల్లలు తమ కాళ్ళపైతాము నిలబడకుండా చేశాను."

ఇటువంటి కథలు మరికొన్ని వున్నాయి. వీటిని ఆయన తన ఆత్మకథలో అతినిరాడంబరంగా, హాస్యానికి తావు యివ్వకుండా వివరించారు. ఒకసారి కస్తూరిబాయ్‌కి జబ్బుచేసింది. ఆమెకు పుష్టికరమైన ఆహారం యివ్వాల్సివుంది. ఆమెకు గోమాంసంతో కలిపిన టీనీటిని యివ్వాలని వైద్యుడు చెప్పాడు. అప్పటికి గాంధిజీ శాకాహారిగా మారిపోయారు. కస్తూరిబాయ్‌కి ఆ మాంసాహారాన్ని యివ్వటానికి ఆయన అంగీకరించలేదు. వైద్యుడు దానిని యివ్వక తప్పదని గట్టిగా చెప్పేసరికి గాంధి ఆమెను ఆవైద్యుని ఆస్పత్రినుండి తీసుకుని వెళ్ళి పోయారు. దీనితో ఆమెకు ప్రాణాలు పోలేదుకాని అంతపని జరిగింది.

కాని గాంధీజీకి ఖచ్చితమైన విశ్వాసాలు వుండేవి. ఆయనకు ఒక విషయం పూర్తిగా మంచిదిగానో లేక పూర్తిగా చెడ్డదిగానో కనబడేది. ఈలక్షణం ఆయన చిన్నతనంలోనే బైట పడ్డది. బాలునిగా వున్నప్పుడే ఆయన సిగిరెట్లను అలవాటు చేసుకున్నారు. సిగిరెట్లు కొనటానికి తండ్రిదగ్గర నుండి డబ్బులు కాజేసేవారు. తర్వాత ఆయన ఈ విషయాన్ని తలపోసుకున్నప్పుడు ఆయనకు తాను మహాపరాధాన్ని చేసినట్టు అనిపించింది. చివరకు ఆత్మహత్య చేసుకోవాలనికూడా ఆయన అనుకున్నారు. తర్వాత యువకుడైనాక ఆయన న్యాయశాస్త్రాన్ని అభ్యసించడానికి భార్య కస్తూరిబాను స్వదేశంలో విడిచిపెట్టి ఇంగ్లండు వెళ్ళారు. అక్కడ ఆయన ఇంగ్లీషు వారిదుస్తులను వేసుకున్నారు. ఇంగ్లీషు స్త్రీలను తనతో షికార్లు తీసుకువెళ్ళారు. ఈపనులన్నీ ఆయనలో తిరిగి పశ్చాత్తాపాన్ని కలిగించాయి. తాను గొప్పనేరాన్ని చేసినట్టు ఆయన బాధపడ్డారు. ఇదంతా ఇంచుమించు విడ్డూరంగా, ఆయనకు భ్రాంతిగా పోస్యం(?)అంటే గిట్టనట్టు కనబడుతుంది. కాని విచిత్రం ఏమిటంటే విడ్డూరమైన దానిని ఆయన విపరీతంగా పట్టించుకుంటారు. నిరాడంబరమైన హాస్యాన్ని ఆస్వాదించే శక్తి ఆయనలో చాలా వున్నది. ఈలక్షణాలు, ఆయన పాపభీతి— వీటితో ఆయనకు, మహామునులకు పోలిక కనబడుతున్నది. అనేకులు సుఖంగా జీవించటానికి చెడ్డపనైనా మంచిదేనని సరిపెట్టుకుంటారు. గాంధి అలా సరిపెట్టుకోలేదు. మహామునులు సరిపెట్టుకోలేరు. గాంధి ఒక సాధువు, ఒక ఉపాధ్యాయుడు, ఆయన రాజకీయాల్లోకి రావటం రాజకీయరంగంలో ప్రమాదవశాత్తు జరిగిన సంఘటన.

19వ శతాబ్దం పూర్తయ్యేసరికి ఆయన దక్షిణాఫ్రికాలో న్యాయవాదిగా పనిచేస్తున్నారు. అక్కడ బోయర్ యుద్ధం ప్రారంభమైనప్పుడు ఆయన ఇండియన్ అంబ్యులెన్సుకోర్ ను ఏర్పాటు చేశారు. ఇది ఉభయ పక్షాలకు చెందిన క్షతగాత్రులకు సేవ చేసింది. ఎవరికైతే తానంటే భ్రాంతిగా గిట్టదో వారిని ఆకర్షించే నేర్పు గాంధికి వుండేది. అది ఆయన యొక్క ప్రత్యేకత. ఈవిధంగా ఆయన జనరల్ స్మట్స్ మైత్రిని సంపాదించారు. అప్పట్లోకూడా దక్షిణాఫ్రికాలో బ్రిటిష్‌వారు, బోయర్లు వర్ణవివక్షణ చూపిస్తూ వుండేవారు. అట్టి పరిస్థితులలో గాంధి క్రైస్తవ గురువు ఏ పనైతే చేసి వుండే వాడో ఆపనిని చేస్తూ వచ్చారు. ఒకచెంపమీద కొడితే ఆయన మరొక చెంపను చూపించేవారు. అంతేకాకుండా ప్రేమతో తన హస్తాన్ని అందించే వారు.



# బలము మరియు శక్తి కోసం!



బోర్న్‌విటా పోషకత్వమునకు సముచితమైనది.
కండరములు మరియు టిష్యూలను బలపరచుటకు ప్రోటీన్‌లు,
బలము మరియు శక్తి కోసం కార్బోహైడ్రేట్‌లు, ఎముకలను
దృఢముగా చేయుటకు ఖనిజ లవణములు మరియు ఆరోగ్యమునకు
అతి ముఖ్యమైన విటమిన్‌లు మీకు లభించును. బోర్న్‌విటా
తయారు చేసుకోవడం సులభం మరియు అది రుచిగా కూడా ఉండును!

## కేడ్‌బరీస్ బోర్న్‌విటా

BENSONS/J.CT-29

దక్షిణాఫ్రికానుండి ఆయన కాంగ్రెసు పార్టీ కార్యకలాపాల్లో నిమగ్నమై పోయారు. కేంబ్రిడ్జిలో పట్టభద్రుడై వచ్చిన యువకుడు జవహర్‌లాల్ నెహ్రూను ఆయన కలుసుకున్నారు. ఆ రోజుల్లో ఆయన కాంగ్రెసు పార్టీ (ఆంగ్లేయుడు ఈపార్టీని స్థాపించాడు.) ఏమని విశ్వసించేదో దానినే తాను కూడా విశ్వసించారు. బ్రిటిష్‌వారి పాలనక్రింద భారత్ స్వయంపాలనకు కృషిచేయాలని కాంగ్రెసు పార్టీ భావిస్తూవుండేది. గాంధి రైతులమధ్యకు వెళ్ళి తన కృషిని ప్రారంభించారు. ఆయన వారి దైన్యావస్థను చూశారు. వారిని ఈ దైన్యావస్థ నుండి పైకి లేవనెత్తాల్సివున్నదని ఆయన గ్రహించుకున్నారు. వారి ఉద్ధరణకు కృషిచేస్తూ ఆయన అనేక సంవత్సరాలు గడిపారు. ఈ కృషిలో ఆయన బ్రిటిష్ ప్రభుత్వం చేతిలో పలుమార్లు ఆశాభంగాన్ని పొందారు. బ్రిటిష్ ప్రభుత్వం జాతీయ ఉద్యమాలను తన ఇనుపకాళ్ళక్రింద నలిపివేయటం ఆయన చూశారు. పూర్తి స్వాతంత్ర్యాన్ని తెచ్చుకోవటం ఒకటే భారత్‌కు శరణ్యమని, బ్రిటిష్‌వారిని బహిష్కరింపచేయాలని ఆయన నిర్ణయించుకున్నారు.

ఆ విధంగా ఆయన దేశానికి దాస్యాన్ని విడిపించటానికి సుదీర్ఘమైన బాట వెంట ప్రయాణం చేయటం ప్రారంభించారు. మధ్యలో ఆయన అనేక సంవత్సరాల పాటు ఖైదులో వున్నారు. ఆ సమయంలో కూడా ఆయన తన దేశం ఎలా వుండాలని తనవుద్దేశమో దానిని మరికొంత స్పష్టంగా రూపొందిస్తూ వచ్చారు. సూక్ష్మంగా చెప్పుకోవాలంటే ఆయన రాజకీయ పద్ధతులు ఆయన నైతిక పద్ధతుల అంత సూక్ష్మమైనవి. ఒకసారి బ్రిటిష్ వారు వుప్పుమీద పన్ను వేశారు. ఇది భారతీయ రైతులకు మోయలేని భారం. గాంధి వెంటనే స్వచ్ఛంద సేవకులను ప్రోగుచేసి గుజరాత్‌లోని దాండి బీచికి వారిని నడిపించారు. అక్కడ ఆయన పిడికెడు సముద్రపు వుప్పును చేతితో తీసుకున్నారు. వెంటనే అధికారులు ఆయనను అరెస్టు చేశారు. ఆయన అరెస్టుపై చెలరేగిన వ్యతిరేకవాదం బ్రిటన్‌లో ఆయనకు పలువురి సానుభూతిని సంపాదించి పెట్టింది. ఇది సూక్ష్మమైన వర్ఛేకాని కుశాగ్ర బుద్ధితో చేసిన పని.

ప్రాచీన కాలంలోని భారతీయ మునుల మాదిరిగా ఆయన కొన్ని రోజులపాటు మౌన వ్రతాన్ని పాటించేవారు. ఆయన అతి నిరాడంబరంగా జీవించేవారు. తక్కువగా తినేవారు. తక్కువగా నిద్రపోయేవారు. రోజు ప్రార్థనా సమావేశాలను జరిపేవారు. ఈ సమావేశాల్లో హైందవ ప్రార్థనలతోపాటు ముస్లిం, క్రైస్తవ ప్రార్థనలు కూడా జరిగేవి. అన్ని మతాలు ఒకటే అని ఆయన భావించేవారు. నా చిన్నతనంలో ఒకసారి బొంబాయి సమీపాన బీచిలో జరిగిన అటువంటి సమావేశానికి నన్ను నా తల్లితండ్రులు తీసుకెళ్ళారు. మహాత్ముడు శిష్యుల మధ్య వేదికపై కూర్చున్నారు. శిష్యులు తెల్లని దుస్తులు వేసుకున్నారు. ఆయన వంటిమీద గోచిగుడ్డ తప్ప ఇంకేం లేదు. సూర్యాస్తమయం వేళ ఆయన కాంశ్య విగ్రహంలా కనబడ్డారు. కనుబొమ్మను కాని కండరాన్ని కాని కదిలించకుండా ఆయన నిశ్చలంగా కూర్చున్నారు. ఆయన వంటి తదేక దీక్షగాచూసి నేను మానాన్న గారి వైపుకు తిరిగి "నాన్నా! ఆయన బ్రతికే వున్నారా?" అనడిగానట. ఆయన బ్రతికేవున్నారు. నేను ఆయనకు ఒక బత్తాయి పండు యిస్తే ఆయన నా బుగ్గ నిమురుతూ అది తనకన్నా నాకే ఎక్కువ కావలసి వుంటుందని చెబుతూ దానిని తిరిగి నాకు యివ్వటం నాకు యిప్పటికీ జ్ఞాపకం. ఎన్నికల సమయం వచ్చినప్పుడల్లా వోటర్ల పిల్లలను ముద్దు పెట్టుకునే రాజకీయ వేత్తల మాదిరిగా కాకుండా ఆయనకు పిల్లలంటే నిజమైన ప్రేమ వున్నది. ప్రార్థనా సమయంలో ఆయన పూర్తిగా జీవించి వున్నారని చెప్పటానికి కూడా లేదు. రోగలక్షణ శాస్త్రజ్ఞురాలైన నా తల్లి ఆయన రక్తాన్ని కొద్దిగా గాజు పలకల పైకి ఎక్కించి వుంచింది. ఈ విషయాన్ని విన్న ప్రజలు, అతి సామాన్యులు, నిరుపేదలు, ఏనాడో మరణించిన సాధువు కాలును ద్రవంలో వేసివుంచి భద్రపరిచినప్పుడు భక్తులైన రైతులు దానిని చూడటానికి ఎలా గుమికూడుతారో అలా గాజు పలకలపై ఎండిపోయివున్న గాంధి రక్తాన్ని చూడటానికి వైళ్ళ దూరం నుండి వచ్చేవారు. ప్రజల మనస్సులలో సుస్థిరంగా నిలబడిపోయే శక్తి గాంధికి వున్నది. ఆయన మంచితనాన్ని ప్రసరింపచేసేవారు. ఆయనతో అమోఘమైన ప్రేమ వుండేది. ఇవన్నీ ప్రజలను సమ్మోహితులను చేశాయి. ఆయన మర్త్యుడంటే వారు నమ్మలేకపోయారు. ఆయన డబ్ల్యు. హెచ్. ఆడెన్ కవి పద్యాలను ఎప్పుడూ చదివి వుండకపోవచ్చును కాని ఆ కవి ఆశాభావంతో కాకుండా నిరాశాభావంతో వ్రాసిన 'మనం ఒకరినొకరం ప్రేమించుకోవాలి లేదా మరణించాలి' అనే వాక్యానికి ఆయన చిహ్నంగా నిలబడ్డారు.

ఆయన మర్త్యుడు. ఆయన మరణించాడు. ఒక విధంగా ఆయన పని పూర్తి అయినప్పుడు, మరొక విధంగా ఆయన పని సరిగ్గా ప్రారంభమైనప్పుడు ఆయన మరణించారు. భారత దేశానికి స్వాతంత్ర్యం రావటం ఆయన చూశారు. స్వాతంత్ర్యంతోపాటు తన దేశం పాకిస్థాన్ సృష్టింపబడటంతో రెండు ముక్కలు కావటం ఆయనచూశారు. భారత చరిత్రలో అత్యంత ఘోరమైన మత కలహాలను ఆయన చూశారు. ప్రజలు ఐకమత్యంతో జీవించాలని అర్థిస్తూ ఆయన ఈ కలహాలు ఆగిపోయేంత వరకు నిరాహారదీక్ష సాగించారు. సనాతన ధర్మావలంబికులైన హిందువులు, ఆయన స్వంత ప్రజలకు ఇది నచ్చలేదు. ముస్లిములు భారత్‌ను విడిచి పెట్టాలని వారి కోర్కె. అందుకు కుట్రలు పన్నారు. ఢిల్లీలో గాంధీ వుంటున్న ఇంటి తోటలో ఒక బాంబును పాతిపెట్టారు. ఆ తరుణంలోనే గాంధి పార్టీలోని యువకులు స్వతంత్ర భారత్‌లో రాజకీయంగా ఆయన నిర్వహించాల్సిన భూమిక ఏమీ వుండదని స్పష్టం చేస్తూవచ్చారు. ఆయన వృద్ధుడు. ఆయన వుద్దేశాలు ఆచరణకు పనికిరానివని భావించాడు. "నేను ముసలివాడినై పోయానని, నావల్ల ఇంకే వుపయోగం లేదని వారు భావిస్తున్నారు. వారు అంటున్నది నిజమే కావచ్చును" అని గాంధి ఈ సమయంలో తన కార్యదర్శి ప్యారీలాల్‌తో అన్నారు.

కాని అభిప్రాయం సరియైనది కాదేమో. స్వాతంత్ర్యానంతరం గడచిన గడ్డు సంవత్సరాలలో సంఘర్షణలతో సతమతం అవుతూవచ్చిన దేశాన్ని, యుద్ధాలతో నలిగిపోతూ వచ్చిన ప్రపంచాన్ని ఆ మృదువైన, వివేకవంతమైన వాణి బ్రతిమాలుకుని దారికి తెచ్చివుండేది. కాని ఆ వాణికి అటువంటి అవకాశం లేకపోయింది. 1948 జనవరిలో ఢిల్లీలో గాంధీ ప్రార్థనా సమావేశానికి వచ్చినప్పుడు ఒక హిందూ అతివాది యువకుడు జనంలోనుండి ముందుకు వచ్చి హిందూ సంప్రదాయానుసారం హస్తాలను ముకుళించి ఆయనకు నమస్కారం చేశాడు. గాంధీ ప్రత్యభివాదం చేయబోతున్నంతలోనే ఆ యువకుడు రివాల్వరు తీసి ఆయనపై ప్రేల్చాడు. గాంధీ రామనామ స్మరణ చేస్తూ క్రింద పడిపోయారు. ఆ తర్వాత కాస్సేపటికల్లా ఆయన ఇంకో మాట మాట్లాడకుండానే కన్ను మూశారు.

ఆయనను చంపిన హంతకుని వురి తీశారు. ఈ పనిని గాంధీ హర్షించి వుండేవారు కాదు. ఆపైన గడచిన సంవత్సరాలలో భారత్ ఒకసారి కన్నా ఎక్కువ పర్యాయాలు యుద్ధంలో పాల్గొన్నది. ఏ రూపంలోనైనాసరే హింసను అసహ్యించుకుంటూ వచ్చిన గాంధీకి ఇది తీవ్రమైన బాధను కలిగించి వుండేది. ఆయన సాత్విక విరోధాన్ని వుపదేశించారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ సమయంలో ఆయన ఆయుధాలను వుపయోగించవద్దని బ్రిటిష్ వారికి సలహా యిచ్చారు. జర్మన్ టాంకులకు అడ్డంగా బ్రిటిష్ సైనికులు పడుకుంటే జర్మన్లలో సోదరప్రేమ కలుగుతుందని, దానితో శాంతి ఏర్పడుతుందని ఆయన చెప్పారు. బ్రిటిష్ వారు, జర్మన్లు తనలాగే వుంటారనుకోవటం ఎంతైనా నవ్వు తెప్పిస్తున్నది. గాంధీజీ సిద్ధాంతాలలోని ఖచ్చితమైన స్వభావాన్ని బట్టి చూస్తే ఈ ప్రతిపాదనను అర్థం చేసుకోవచ్చును.

గాంధీ స్వతంత్ర భారత్ గ్రామీణ ప్రజల భూమిగా వుండాలని అనుకున్నారు. వారు తమ బట్టలను తామే తయారు చేసుకోవాలని, తమ ఆహారాన్ని తామే పండించుకోవాలని ఆయన ఆశించారు. పరిశ్రమలను ఆయన ద్వేషించారు. ఆయన మరణానంతరం పరిశ్రమల స్థాపనే భారత ధ్యేయంగా వున్నది.

గాంధీజీ చూపించిన మార్గాన్ని, భారతదేశం కాని ప్రపంచం కాని అనుసరించటం లేదు. మానవ స్వభావం సంగతి తెలిసిన మనం అవి గాంధీమార్గాన్ని అనుసరిస్తాయని ఎదురు చూడలేం. ఈ రోజుల్లో శాంతిని గురించి మాట్లాడేటప్పుడు ప్రజలు ఆయన పేరు ఎత్తుతున్నారు.

నిజానికి నేడు ఎవరూ గంధీ సిద్ధాంతాలకు అంటి పెట్టుకుని లేరు. ఆయన తన దేశానికి స్వాతంత్ర్యాన్ని, ప్రపంచానికి ఒక జీవిత విధానాన్ని యిచ్చారు. ఆయన దేశం స్వాతంత్ర్యాన్ని పుచ్చుకున్నది కాని మిగతా ప్రపంచంతోపాటు ఆయన అందించిన జీవిత విధానాన్ని త్రోసిపుచ్చింది. చివరకు గాంధీని ప్రజలు రాజకీయాలలో కలుసుకుపోయిన సాధువుగా భావించవచ్చును. ఆయన జీవితంలోని విషాదం, వైభవం కూడా ఇదే. ●

(ఫోరమ్ వరల్డ్ ఫీచర్సు)

# "మా వంటచెరకు ఖర్చుతగ్గింది మీకు తెలుసా! లీకోకి కృతజ్ఞతలు"

లీకో-స్వల్పమైన ధర, ఉపయోగించటం తేలిక, పొగలేని గృహసంబంధమైన వంటచెరకు, ఏ రకమైన వంట పాత్రకైనా తగినట్టిది.



చిన్న లీకో ముక్కలను ఎన్నుకోండి.



ఆ ముక్కలను మీ కుంపటిమీద పల్చని పొరలా అమర్చుకోండి



ఈ లీకో పొరను అంటించండి



ఆ పొర అంటుకొని మండటం ప్రారంభం కాగానే క్రమంగా లీకోను చేర్చండి

# లీకో

కాలాన్ని మరియు ధనాన్ని పొదుపు చేస్తుంది.




నైవేలి లిగ్నైట్ కార్పొరేషన్ లిమిటెడ్, నైవేలి-1.

EDS NLC 713 TE A




### జ రి గి న క థ

మగధరాజు బింబిసారుడు ఆమ్రపాలిని చేపట్టా లనే ఉద్దేశ్యంలో వైశాలికి వస్తాడు. పాలి భవనంలో ప్రవేశించి ఆమెని ఆకర్షిస్తాడు. పాలికి బింబిసారునిపై ప్రేమ జనిస్తుంది. మహానాముడు ప్రవేణి పుస్తకాన్ననుసరించి పాలిని దేశనర్తకిని చేస్తాడు. బింబిసారుని వివాహం చేసుకున్న పాలికి తన తండ్రి నిర్ణయం తెలిసి మరణశయ్యమీద ఉన్న మహానాముని చెంతకు వస్తుంది. మహానాముడు మరణిస్తాడు. పాలి కోసం అనేకదేశాలవారు పడిగాపులు పడసాగారు. ఇరు రాష్ట్రాలమధ్య సఖ్యత కోసం పాలి సహాయాన్ని అర్థించాడు సంజయుడు. చేసిన బింబిసారుల వివాహమైపోయింది. అందుకై లిచ్ఛవీయులు కయ్యానికి కాలుదువ్వారు. పాలి కలవరపడసాగింది.

## ౨౦

పాలి ఈక్షణంకోసమే ఎదురుచూస్తోంది. ఆమె ఒకసారి పరిషత్తువైపు చూసి, తర్వాత నగర శ్రేష్ఠివైపు తిరిగి మాట్లాడ నారంభించింది.—'సభాపతి, నేడు పరిషత్తు ఏకారణంవల్ల సమావేశమైందో, ఆకారణంవల్లనే నేనూ ఇక్కడికి వచ్చాను. నేడు నలుదిశలందున్న రాజులు శక్తిశాలులగు లిచ్ఛవీయులను నష్టపరచడానికి ఉద్యమిస్తున్నారు. మనం వాళ్లతో పోరి, ఖండింపబడి, తక్కువై తుదకు మన మందరం నాశనంకావాలనే వాళ్లకోరిక. చేటక రాజు శక్తిగల లిచ్ఛవీయుడు. పరరాజులతన్ని మననుండి దూరంచేశారు. చేటకరాజు విడివడడంవల్ల లిచ్ఛవీయ గణం శక్తివంతమైన హస్తం ఖండితమవుతుంది. నేడు వీరతణ్ణి బహిష్కరిస్తున్నారు. రేపు మరికొందరిని బహిష్కరిస్తారు. ఈవిధంగా సమస్త జంబూ ద్వీపంలోని విఖ్యాత లిచ్ఛవీయగణం ఐకమత్యమూ, సంఘశక్తీ నష్టమవుతాయి. ప్రవేణీ పుస్తకం శక్తివంతమైన రాష్ట్రాలతో సంబంధమేర్పరచుకోడాన్ని నిషేధించదు. కాని, కొంతకాలమైన తర్వాత కలపబడిన నూతన నియమాలే లిచ్ఛవీయులను ఒంటరిగా ఉండటానికి శాసించాయి. నిజానికి ప్రవేణీపుస్తకం స్వాభిమానము కాపాడుకుంటూ ఇతర మహారాజులతో సంబంధము నేర్పరచుకోడానికి స్పష్టంగా అనుమతించింది...... చాటకరాజు నలుగురు కుమార్తెలు బయటకు వెళ్లడం వల్ల శత్రువుల మనసునుండి శత్రుత్వము నష్టమైతే ఇందులో లిచ్ఛవీయులకేమి హాని ఉంది? లిచ్ఛవీయగణం శక్తివంతమైనది. కాని ఆశక్తిని సురక్షితంగా ఉంచుకొన్నప్పుడే మనం ముందుకు పోతాం. శక్తిని వ్యర్థంగా వెచ్చిస్తే మనవినాశం స్పష్టం. శత్రువులు మనల్ని ప్రోత్సహిస్తారు. లిచ్ఛవీయులు స్వదేశప్రేమ అను పేరుతో నష్టమవుతూ పోతారు. ప్రజ క్షీణిస్తుంది. ఈవిషయంలో మనం శ్రద్ధ చూపాలి. తెరపిలేని యుద్ధంవల్ల లిచ్ఛవీయ ప్రజ నష్టమవడానికి అధికావకాశముంది. కావుననే అంతర్రాష్ట్రీయ సంబంధం ఒకరాష్ట్రాన్ని మరొకదాని కంటే ఎక్కువ శక్తివంతంగా చేస్తుందని నేను చెప్తున్నాను. స్వతంత్ర లిచ్ఛవీయ గణాలు శక్తివంతమవుతాయి. పూజ్యులగు సభ్యులు చాటకరాజును అవమానింపక సమ్మానింతురు గాక అని వారిని నేను ప్రార్థిస్తున్నాను. లిచ్ఛవీయగణ తంత్రం నుండి అతని అంతర్భావం నష్టం కాకూడదు.

'కానిబింబిసారుడు మనశత్రువు' అని శివిమిత్రుడన్నాడు.

పాలి వెంటనే ముఖం త్రిప్పి ఉత్తరమిచ్చింది. —'వైశాలిలోని లిచ్ఛవీయులకు శత్రువు సమస్త వజ్జీయులకూ కాదు'

'శత్రు స్నేహం.........'

'పరిషత్తుకి ద్రోహం కలిగిస్తుంది.'

'వైశాలిలోని లిచ్ఛవీయులు వజ్జీయులు కాబట్టి బింబిసారుడు వజ్జీయులకూ శత్రువే.

పాలి నలువైపులా చూచింది. పరిషత్తులోని కొందరు సభ్యులు విరోధపడుతున్నారు. ఆమె స్వరం మారింది.

ఆమె వినయంతో సభాపతితో అంది— 'శత్రువు మనకు లొంగిన యెడల అతనితో యుద్ధం మాని అతనిని మిత్రునిగా చేసుకొను అనుమతిని కూడ పరిషత్తు ప్రసాదించ గలదు.'

'ప్రవేణి పుస్తకం అటువంటి అనుమతిని గూడ ఇస్తుందా?' అని శివి వెంటనే ఆక్షేపించాడు.

పాలి ఆడసింహంలా ముఖంత్రిప్పి శివివైపు చూచి వ్యంగ్యపూరితమైన స్వరంతో అంది—'ప్రవేణిపుస్తకంలోని ఇతర ఖండాలను విన్నప్పుడు నలభై తొమ్మిదో ఖండాన్ని వినడం మరచిపోకు!

తిరిగి పాలి సభాపతివైపు చూచి లిచ్ఛవీయగణానికి స్వామిని లాగ ఆజ్ఞాపూరిత స్వరంతో విశ్వాసంతో అంది— 'సభాపతీ, వీరలిచ్ఛవీయులకు శోభనిచ్చు సూచనను పరిషత్తుకు ఇవ్వడానికి వచ్చాను. లిచ్ఛవీయులను ప్రతిభా సంపన్నులు, అభేద్యులు సమ్మానితులుగ ఉంచడానికి పరిషత్తు చేటక రాజు కార్యమును గౌరవించుటకు సమ్మతించాలి. ఎందుచేతననగా ఈసమయంలో పరిషత్తు ఎదుట సరియైన మార్గం ఇదొక్కటే ఉంది. లిచ్ఛవీయ పరిషత్తుకు జయమగుగాక. స్వదేశానికి జయమగుగాక!'

కొన్నిక్షణాలు అయ్యాక ఆ లిచ్ఛవీయ సంథాగారం లో విద్యుత్కాంతిలాగ సమస్త పరిషత్తు ముఖంనుండే - ఈమాటలే వెలువడ సాగాయి. సంథాగారానికి వెలుపలనిల్చియున్న శ్రోతలు వానిని గౌరవించారు. మహానాముని విస్మృత తేజమైన మహానాముని స్తుతి జయఘోష మధ్య తిరిగి విన్పించింది.

* * *

నేడు చాటకరాజునకు పాదాలు భూమి

మీద పడటం లేదు. ఇతర ప్రాంతాలనుండి లిచ్ఛవీయనాయకులు రాజులు వచ్చారు. నేడు సమస్త లిచ్ఛవీయ నేతా గణాలూ ఒకేభూమిమీద సమావేశ మయ్యారు.

ఎప్పటినుంచో ఒకరినొకరు ఎడమై యున్న లిచ్ఛవీయ మహారథులందరూ నేడు చేతిలో చెయ్యివేసుకుని కూర్చున్నారు. చేటకరాజు రాజధానిలో ఎన్నో ఏండ్లకు పూర్వం ఐకమత్యంతో ఉన్న దినములు రావడం చేత నలువైపులా ఆనందం అలుముకుంటోంది.

లిచ్ఛవీయులకు ప్రియమైన పాలి తర్కము, ప్రేమల సహాయంతో పరిషత్తును జయించింది. కేవలం పాలి సామర్థ్యంవల్లనే వైశాలిలోని అన్య లిచ్ఛవీయగణాలు సమావేశ మయ్యాయి. పరిషత్తు చేయులేక పోయిన శ్రేష్ఠకార్యాన్ని పాలి దేశంకోసం చేసి చూపింది. నేడామె ఒక లిచ్ఛవీయుని ఒకస్థానం, ఒకస్వరం నిశ్చితం చేసింది. కాబట్టి అందరికంటే అధికానందం దేశనర్తకికే ఉంది.

రేపు చేతన వెళ్ళిపోతుంది. ఆమెతో పాటు ఇతర లిచ్ఛవీయరాజులూ పోతారు. కాబట్టి నేటిసభకు అధిక మహత్త్వం ఉంది. చేటక రాజు లిచ్ఛవీయనాయకులను ఒకరి తర్వాత ఇంకొకరిని బింబిసారుడికి పరిచయం చేస్తున్నాడు. ఆ సమయంలో బింబిసారుని శిష్టాచారం వినమ్రత లిచ్ఛవీయుల గర్వాన్ని సంతుష్టి పరచాయన్నట్లు ఉన్నాయి.

లిచ్ఛవీయ వీరుల తోటీ, మాగధీయ సర్దారులతోటీ రాజసభ అంతా నిండి పోయిన తరువాత అక్కడికి బింబిసారుడూ చేటక రాజూ ప్రవేశించారు. వారు చిరునవ్వుతో అందరకూ నమస్కరిస్తూ ముందుకు సాగుతూ పోయారు.

సంతోషం కలిగినా, అందరిమనసూ పాలి కోసం క్షోభం అనుభవిస్తోంది. పరిచయాలు జరిగిన తర్వాత, చివరకు వివాహమండపానికి రాక నర్తకి పాలి సభామంటపంలో ప్రవేశించింది. బింబిసారుడు ఏండ్లు గడచాక పాలిని చూచాడు. చూపులు కలియగానే బింబిసారుడు ముఖం త్రిప్పివేశాడు. మొదట అతడు పాలిని చూడగానే స్తబ్ధుడయ్యాడు. తక్షణం అతని హృదయంలో ఆక్షణంలోనే పరుగెత్తి పాలిని కౌగలించుకోవాలను త్రొటుపాటు కలిగింది. కాని కొన్ని క్షణాలలోనే అతని శరీరంలో క్రోధం, ఈర్ష్య, లజ్జలతో కూడిన భావనా పూరితమైన అగ్ని ప్రజ్వలిత మయింది. ముఖం త్రిప్పివేసుకోవడం తప్ప అతనికి వేరే మార్గమే లేదు.

కాని పాలి తన ప్రియతముని మూర్తి తన హృదయంలో చిత్రిస్తూందో అన్నట్లు అతనిని ఎన్నో క్షణాలు చూసింది.. అతన్ని చూచిన తర్వాత ఆమె మందహాసం చేస్తూ సభవేపు చూడ సాగింది. వాద్య విశేషాలు సిద్ధమయ్యాయి. ప్రేక్షకులు చూడడానికి తలలెత్తారు. నర్తకి పాలి కాళ్లు చేతులూ సంగీతతాళాలతో కూడానాట్య మాడ సాగాయి. చూస్తూండగానే సభఅంతా ఊగ సాగింది. రాజు మొదలు ద్వారపాలునివరకు అందరూ



# ఆమ్రపాలి

పాలి నృత్యము చేత ఆకర్షింపబడ్డారు. అందరికళ్ళు పాలిలో లగ్నమయ్యాయి.

బింబిసారుడొక్కడే నర్తకి పాలి నృత్యాన్ని హృదయ పూర్వకంగా చూడలేక పోయాడు. మొదటి పాలిని చూడగానే అతని మనసు, ప్రేమతో ఆహ్లాదితమైంది. కాని ఇప్పుడు మాత్సర్యం, ధిక్కారం చేత తపించి అతని కళ్ళు నిప్పుల్లా ఎర్రబడ్డాయి. పాలి నాట్యం చేస్తూ ప్రేక్షకులందరి మనసూ తనమీద నిలుపుకొన్నప్పుడు, బింబిసారుని మనసు ఒకప్పుడు పాలిని నష్టపరచడానికి ఉద్యమించింది. ఒకప్పుడు ఆమెను చూడగానే సన్యాసం పుచ్చుకోవాలనే ఔదాసీన్యం పొందింది. ఒకప్పుడు పతిద్రోహి అయిన స్త్రీ రూపంలో నిండు సభకుమెల్ల పట్టుకుని తెచ్చి అక్కడ తిరస్కరించి కాల్చి వెయ్యాలను ప్రేరణతో మండి పడింది.

కాని సభ అంతా ఆమ్రపాలి మీద ముగ్ధ అయి ఆమె నృత్యాన్ని విస్మిత దృష్టితో చూస్తూండడం వల్ల నాట్యం అవుతున్నంత వరకు అతడు తన విభిన్న భావాలచే దగ్ధుడవుతున్నాడు. పాలి ప్రతి అంగము, ఆమె కదిలించిన గతి శీలము, ఆమె ప్రత్యేక కటాక్షవీక్షణం, ఆమె మనోహర ముద్రలు, అంగ విన్యాసాలు, ఆమె అధరాల మందహాసంముఖంలోని భావ భంగిమ ప్రతి దానినిముగ్ధుల్ని చేశాయి. తన నృత్యానికి ప్రతివానిని పిచ్చివానిగా చేసి పాలి 'సభాలోని ఛవి స్మృతి' అయింది. నేటి సభదీనికి ప్రత్యేక ప్రమాణం. నృత్యం సమాప్తమగునప్పుడు పాలినాట్యం చేస్తూ బింబిసారుని సమీపించి అతని చరణాలమీద సరసమైన కానుకగా పుష్పాలను ఉంచి నృత్యము ముగించింది. బింబిసారుని సాహసం హద్దుమీరింది. అతడు నిండుసభలో ఆమ్రపాలి వంక చూడనైన లేదు. కాని ఆమె వెళ్ళిన వెంటనే ప్రజలు చూడకుండా ఆ సుకుమారమైన పూలకొమ్మను త్రొక్కివేసింది. సంజయుడు దగ్గరే నిలబడ్డాడు. కాలితో త్రొక్కబడ్డ పుష్పహారాన్ని చూసి అతని హృదయం ఆహతమైంది. అతడు ఊహలలో నిండుగా అలంకరింపబడ్డ చిన్న పుత్తళికను చూశాడు.

సభ ఇప్పటివరకూ పాలి నృత్యంలోమునిగి ఉండడం వల్ల పాలకునితో ఉండలేదనడం నిజం. కాబట్టి బింబిసారుని అతీవ్ర కోపాన్ని చూడలేక పోయింది. లేకపోతే కొద్దిక్షణాలలోనే అక్కడి వాతావరణం ఎలాటి రూపాన్ని ధరించి ఉండేదో! కాని బింబిసారుని ఆకస్మిక కార్యం చేటక రాజుకి మరుగు పడలేదు. అతనికి క్షోభ కలిగింది. కాని మౌనంగా ఉన్నాడు. అతడు మృదు దృష్టితో వీక్షిస్తూ చూశాడు కూడాను. కాని ఆమెతో చూపు కలపగానే కళ్ళు వాలిపోయాయి. సభముగియగానే బింబిసారుడు అక్కడ నుండి శీఘ్రంగా వెళ్ళి పోయాడు. సంజయునికి దుఃఖంతో కోపం కూడావచ్చింది. అతడు నిరాశ చెందాడు. ఇద్దరు మనసు లోని మాట అతడే సరిగా ఎరుగును. ఇదే అతనిలోని నిరాశా పూరితమైన దుఃఖానికి కారణం.

రాత్రి అయింది. చేటకరాజు వృద్ధ వైణికుడు వీణవాయిస్తున్నా, ఆనాటి మొదటిరాత్రి విషయాన్ని గురించి కవులు, రాజగాయకులు చెప్పిన విషయమేమీ నేడు కన్పించడం లేదు. మనసులో అనను భూతమైన భావాన్ని ప్రేరేపించి చేలన ప్రథమరాత్రి సంగీతం వింటూబింబిసారుని కోసం ఎదురుచూస్తోంది. వృద్ధవైణికుని తానం ఆమె ఉత్కంఠన్ను మేల్కొల్పుతోంది. కాని బింబిసారుడింకా శయనగృహంలో కాలుపెట్టలేదు. చేలన అనేక భావనలతో, ఆలోచనలతో కంపిత మవుతోంది. సూర్యోదయం కాగానే ఆమె ఇక్కడినుండి వెళ్ళాలి. చైత్యపూజకూడా చేయవలసి ఉండడం వల్ల ఆమె చాలా పెందలకడనే లేవాలని రాజమాత పది సార్లు చెవిలో చెప్పింది. లేచి లేవడానికి ముందు భక్తి పూర్వకంగా చైత్య పూజ చేయాలనీ, లేకపోతే అనర్థం కలుగుతుందనీ చేలనకు బాగా తెలుసు.

రాత్రి గాఢమయింది. చంద్రుడు ఆకాశంలో పరుగెడుతున్నాడు. చేలన చాలా కాల జాగ్రత్తగా చేసుకున్న శృంగారం అస్తవ్యస్తం కావడం మొదలు పెట్టింది. పురుషుణ్ణి బయటినుండి ఆసక్తుణ్ణి చేయడానికి స్త్రీ సులభమైన స్వభావంతో రాత్రి గడచిన కొద్దీ ఆమె మన

మాతాపితృలకి చాలా సేవలతో తీర్చిన్న మైన ఈర్ష్యచేత బింబిసారుడు పొంది పడ్డాడు. అతడేవిధంగానూ పాలి పేరు వినగోరలేదు. ఈసారి అతడు తనభావాలను ప్రయత్నపూర్వకంగా అణచి ఉంచాడు.

బింబిసారుడు అకస్మాత్తుగా ఊరుకోవడం చూచి చేలన అతనికింకా సరదాగా వచ్చింది.

'నన్ను విచారణగలేదు ఎందేత?.... పోనీండి నేనే చెప్తాను...... అందరికంటె మిమ్మల్ని ఎక్కువగా ప్రశంసించే వారెవరో మీరెరుగుదురా'?........ ఈ ప్రసిద్ధనర్తకే.. రాత్రింబగళ్ళు నాముందు మీ ప్రశంస చేసేది కూడా ఈ అందగత్తె నర్తకే. నన్ను ఉత్తేజపరచడానికి ఆమె మిమ్మెంత మనంగా ప్రశంసిస్తోందని నాకిప్పుడు తెలిసింది.' చేలన కళ్ళల్లో మృదురోషం నింపి అంది.

బింబిసారుడు ఒకస్మాత్తుగా నవ్వి అన్నాడు. 'నిన్ను ఉత్తేజితగాచేస్తే నర్తకికి ఏం లాభం కలుగుతుంది?'

బింబిసారుని ఈ ప్రశ్నలో కాఠిన్యం ఇమిడి ఉంది. ఈసంగతి చతురురాలైన చేలన గ్రహించింది. ఆమె ప్రేమను భగ్నం చేయగోరలేదు. ప్పుడు మందహాసంతో ఇలా అంది.—

'నర్తకురాండ్రు మీకు నచ్చరు...... ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయమే. నాకూ చాలా ఇష్టమే.'

'నర్తకురాండ్రు నాకు నచ్చరని నేనెప్పుడన్నాను?'

'అయితే ఈనర్తకే ఎందుకు నచ్చదు? మహారాజా, ఆమ్రపాలి కేవలం నర్తకే కాదు. నాకు సఖి, గురువు కూడాను. దేవా, పాలి అద్భుతమైంది........ ఏం మీరామెను గుర్తింపరా?'......

బింబిసారునికి పాదంలో ముల్లుగుచ్చుకున్నట్లయింది.. ఇంగారువల్ల అతడు గదిలో నడాడుతున్నాడు. ఈమాట విని అతడుముందుకు పోలేక పోయాడు, వెనక్కి పోలేక పోయాడు. నిలబడి అతడు కేవలం చేలనను చూస్తున్నాడు. పాలిని, తన పాలిని అతడు స్వయంగా గుర్తింపడా? చేలన పాలినెంత గుర్తిస్తుందో ఆమె నడగాలని అతనికి కోరిక కలిగింది. ఆమ్రపాలి యెడల అతని హృదయంలో

# ఆమ్రపాలి

వృష్టి కాఠిన్యం చేలన మాటవిని మరింత పెచ్చింది. కాని, అతడు భావోద్రేకాన్ని బలవంతంగా ఆపివేశాడు. వివాహానికి మొదటి రాత్రి ఇంతకంటే వేరుమార్గం లేకపోయింది. అతడన్నాడు— ''నేనామెను గుర్తించుట లేదని నీవు నిజం చెప్తున్నావు.' 'అయితే అలా చెప్పండి. ఆమె దేశ నర్తకి కాకపోతే ఏమిచేసి ఉండేదో మీరెరుగుదురా?'

చేలన దేశనర్తకిమాట విడచి పెడుతుందనిబింబిసారుడనుకున్నాడు. కాని ఆమె ప్రసంగం పెరగడం వల్ల విసిగి ముఖం లోతీవ్ర భావాన్ని అణచి అతడన్నాడు— 'ఆత్మహత్య చేసికొని ఉండేది.'

చేలన ప్రేమపూరితమైన రోషాన్ని చూపుతూ అంది—

'మహారాజా, అలాంటి అశుభాన్నినోటి వెంట రానీయకండి........ ఆమ్రపాలి ఎవడైన మహారాజుకు రాణి అయి ఉండేది.'

బింబిసారు డొక్కసారిగా అన్నాడు— 'అశక్యం, అసంభవం, ఒక తుచ్ఛనర్తకి...'

'అవునుమహారాజా, — బింబిసారునికి కోపం తెప్పించడానికి చేలన అంది.—మహానామునిపుత్రి, ఆమ్రపాలి మనఃపూర్వకంగా బింబిసారుని వరించిందని మాసోదరీలందరూ ఇక్కడ విన్నదినం కూడా ఉంది. మేము విన్నాము....'

'ఏం విన్నారు?......' బింబిసారుడు ఒక్కసారిగా ఉలికిపడి కంగారుతో అడిగాడు. రాణి చేలన గంభీరభావంతో జవాబిచ్చింది. 'మగధరాజు మారువేషంతో పాలిని చూడడానికి వెళ్ళారని విన్నాను.

గొప్పహానిని సహించి ఆమెను పెళ్ళాడడానికి యత్నించారు .... ఈసంగతి నిజమేనా?'

'అసత్యం....'. పూర్తిగా అసత్యం.'

'నామహారాజు అసత్యమాడడం బాగావిరుగునని ఆమ్రపాలి నాకు చెప్పడం ఎలా మంచిది?.......

బింబిసారుడు చేలనతో ఓడిపోయాడు. కానివ్యక్తిత్వాన్ని కాపాడుకోడానికి అతడన్నాడు.— 'నేను చూడడానికి అవశ్యం వెళ్ళాను, కానిపాలినికాదు......'

'కాని పాలిని చూశారు కదా?'

'అవును కాని కెళ్ళిన కారణం తరికోతాను' '......నిజానా మాటడా నిజా?'

బింబిసారుడు చేలన చేతులు పట్టుకున్నాడు. ఆమెకు చాలా దగ్గరగావెళ్ళి అన్నాడు—' దేవి, మనమీ విషయం ఇక్కడే ముగించలేమా?'

చేలన బింబిసారుని అలాగే విడిచేదికాదు. ఆమె మనస్సు చాంచల్యంతో మదిస్తోంది ఆమె అంది—

'లేదుప్రభూ, నేడు నాసఖిని మరువలేను.'

బింబిసారుడు చేలన చేతులు వదలి కొంతదూరంగా తొలిగాడు. క్షణంసేపు చేలన అతన్ని చూస్తూఉంది, తర్వాత ఆర్ద్ర స్వరంతో అంది—'దేవా,ఆ ప్రేమమయి వల్లనే నాకీ మహాసౌఖ్యం కూడ డానికి లభించింది. దీన్ని నేనుమరచిపోలేను. ఆమెయే నామనోద్వారాల్ని తెరిచింది. నేను వివాహమాడకుండాఉండడానికి నిశ్చయించాను అయినా, నేనామె మాటలలో ఎలా పడ్డానో నాకు తెలియదు. నన్నామె ఉగ్రరూతలూపి ఎలా మేల్కొలిపిందో, నావిషాదపూరిత జీవితంలో ఆమె ప్రేమాంకురం ఎలా నాటిందో, నేను ప్రపంచాన్ని ఇంకోవిధంగా ఎందుచేత చూడసాగానో, నేను మీదాన్ని ఎలా అయ్యానో—ఇదంతా నేను ఆవంతకూడా తెలుసుకోలేక పోయాను. ఎప్పుడు తెలుసుకున్నానో అప్పుడు కేవలం ఆమ్రపాలే స్మృతిలో ఉంది. మహారాజా, ఈ దివ్యనర్తకి అద్భుతమైంది. నేడామె పుణ్యప్రతాపం చేత సర్వత్ర మంగళం కన్పిస్తోంది. నేడు ఆ మంగళమయి మూలంగానే ఈ నగరం ఇంద్రపురి అయింది. మహారాజా, మీ జీవితంలో ప్రవిష్టనవడానికి మొదటి అడుగు పెడుతూ నేను మిమ్మల్ని ఒక్కమాటే అడుగుతాను— నాసఖిని మీరు ఈర్ష్యతో కాకుండా ప్రేమతో చూడండి. మరి ఇతర కారణమేమీ లేకున్నాకేవలం ఆమె నాసఖి అవడం వల్ల.....'

చేలన కంఠంలో అత్యంత ఆర్ద్రతతో దాగిన నిజమైన భావనను బింబిసారుడు స్తబ్ధుడై చూస్తున్నాడు. చేలన నిలబడి బింబిసారుని రెండు చేతులు పట్టుకొని మళ్ళాఅంది. 'వరదానాన్ని ఇవ్వండిమహారాజా, మాటివ్వండి......'

సమాధానంగా బింబిసారుడు చేలననుపట్టి

కొని చంద్రికాభిషిక్తమైన భవనంలోకి తీసుకుపోయి అన్నాడు 'ప్రయత్నిస్తాను, చేలనా, తప్పక ప్రయత్నిస్తాను,' ఇలా అని అతడొక దీర్ఘనిశ్వాసాన్ని విడిచాడు.

ఈసమయంలో వృద్ధవైణికుని సంగీతం తన సంపూర్ణమైనగతితో వికసించింది.

రాత్రి పెరగ సాగింది. చేలన గాఢ నిద్రలో ఉన్నప్పుడు బింబిసారుడు మెల్లగా శయ్యనుండి లేచి నిల్చున్నాడు. అతడామె ముఖాన్ని చూడ సాగాడు— చేలననిర్దోషమైన ముఖంమీద 'వరదానమివ్వండి మహారాజా, మాటివ్వండి...నా సఖిని మీరు ఈర్ష్యతో కాదు, ప్రేమతో చూస్తారు' అను మాటలు ఇప్పటికీ ఆడుతున్నట్లుంది. బింబిసారుడు మెల్లగా అక్కడనుండి వెలుపలికి వచ్చాడు, అతని మనస్సు భ్రమిస్తోంది. ఏమీ తోచడం లేదు. హృదయంలో గాబరా తీవ్రమైంది. మహల్లోంచి వెలుపడి అతడు మెల్లగా ఉద్యానానికివచ్చి కూర్చున్నాడు. తాను ఉద్యానవిహారానికోసం తయారైన ఒకలాసనం దగ్గిర కూర్చున్నట్లూ, తనకు అనతాతి దూరంలోనే ఒకమందార వృక్షం, దానికి దాపున సన్నజాజి, దానినంటి మాలతి ఉన్నట్లు అతనికి అకస్మాత్తుగా గుర్తుకొచ్చింది. ఆమహల్లోని ఉద్యానం, ఉద్యానంలోని ఆసనం జ్ఞప్తికి వచ్చాయి. ఓహో సుగంధమూ అలాంటిదే. అతడు పైకి చూశాడు—చంద్రుడూ అలాగే ఉన్నాడు. ఇటూ అటూ చూశాడు రాత్రి అలాగే ఉంది. లోపమేమైనా ఉంటే అది ఆకుల చప్పుడు చేసి ఎవరైనా రావడమే. అతనికి భ్రమ కలిగింది. తిరిగి ఆకుల గలగల ధ్వని అయింది. అతడు వెనక్కి చూసి అదరిపడి నిల్చున్నాడు. నాలుక చివరివరకూ వచ్చిన ఆమ్రపాలి పేరు అక్కడే ఆగిపోయింది. ఆకులు చప్పుడవడం అతని భ్రమకాదు. సత్యమే. ఒకచిన్న మొక్కను తొలగించి సంజయుడు ఎదురుగా నిల్చుండడం బింబిసారుడు చూచాడు. భ్రమ తొలగి పోయింది. ఇద్దరూ ఒకరినొకరు చూస్తూ ఉన్నారు. బింబిసారుడు విస్మితుడై అడిగాడు—

'సంజయా, నీవింతవరకూనావెనకాలే తిరుగుతున్నావా?'

'లేదు, దేవా?'

'నిద్రరావడం లేదా?'

'లేదు, మహారాజా.'

'అయితే, ఏమీ కారణంలేదా?'

'ఉంది, దేవా.'

'అయితే ఇంతవరకూ నాతోచెప్పలేదేమి?

'ఎలాచెప్పాలో ఇప్పటివరకు నేను తెలిసికోలేకున్నాను. ఇప్పుడు కొంచెం తెలుసుకున్నాను.

బింబిసారుడు దూర దృష్టితో అతన్ని చూడసాగేడు. సంజయుడూ అతన్ని చూస్తున్నాడు. అతని హృదయావేశాన్ని ఆపు శక్తి ఎవరికీ లేనట్లు అతడు శక్తివంతంగా, శాంతిపూర్వకంగా మాట్లాడాడు.—

'మహారాజా, అన్యాయాన్ని, నిష్ఠురాన్ని చూడడానికి కళ్ళు తెరచిఉండాలి. అందుచేతనే మేల్కొని నడాడుతున్నాను.

తక్షణం బింబిసారుని స్వరం మారిపోయింది. కొంత కఠోరంగా అతడన్నాడు 'సంజయా.'

కాని సంజయుడు బింబిసారుని ఇంకేమీ అననీయ లేదు. పరుగెత్తి అతని చరణాలు గట్టిగా పట్టుకొని అన్నాడు— 'ఒక్కసారి నన్ను నీ ఆ అమాయికుడూ, సరళస్వభావుడూ అయిన మిత్రుణ్ణి అనుకొని ఆజ్ఞాపించు'.

బింబిసారుడు ఆవేశం ఆపుకొని అన్నాడు 'సంజయా, నీవు మాగధీయుల మహామంత్రివి. నేను నిన్నెప్పుడూ నా మిత్రుని గానే తలచాను.'

'అయిన మహారాజా, నేను పూర్తిగా చెప్పగోరేదాన్ని చెప్పనివ్వండి......'

'బింబిసారుడు సంజయుని లేవదీసి దగ్గర కూర్చుండబెట్టి స్నేహపూర్వకంగా అన్నాడు—'మిత్రమా, చెప్పు.......నేను నీవు చెప్పేమాటను దేనినీ విడువలేను.....చెప్ప వలసినది చెప్పు.'

సంజయుని కంఠం రుద్ధమైంది. కొంచెమునేపు అతడు తలవంచుకుని కూర్చున్నాడు. అప్పుడు బింబిసారుని చూచి గద్గద కంఠంతో అన్నాడు. 'మహారాజా, మీరు ఆమ్రపాలిని ఈర్ష్యతోచూడవద్దని మీ యీ నిరుపేద అయిన బాల్యసఖుడూ కోరుతున్నాడు."

బింబిసారుడు నోటమాటలేక సంజయుని చూడసాగేడు. సంజయుడు కూడా చేలన చెప్పిన ప్రతిమాటా చెప్పాడు. అతని యాచన, భావన సరిగ చేలన యాచన భావనల వలె ఉన్నాయి. ఇద్దరూ ఒకే విధంగా ఒకే మాట చెప్పడానికి మొదటే నిశ్చయించుకున్నారేమో అన్నట్లుంది.

కొంత సేపటివరకు బింబిసారుడు సంజయుని అట్లే చూస్తున్నాడు. ఒకసారి చేలన, మరొకసారి సంజయుడు అతని కళ్ళముందు ఉండుండి మెరవ సాగారు. హృదయంలో ఒక బలమైన గాయం తగిలినట్లయింది. క్షణంలో అంధకారం దూరమయింది. మాత్సర్యం అకస్మాత్తుగా మాయమైంది.

అతడు సంజయుణ్ణి అంటిపెట్టుకుని కూర్చుండి ఆవేశంతో అన్నాడు—'చెప్పు మిత్రమా, చెప్పు. నేను ఆమ్రపాలిని మత్సరంతో ఎందుకు చూడకూడదు?'

సంజయుడు విస్మితుడై అతన్ని చూస్తున్నాడు. కళ్ళల్లో నీరు నింపి అతడన్నాడు— 'ఎందుకా మహారాజా?.... చూడు......' అని అతడా నలిపివేసిన పుత్తళికను అతడిచేతిలో వుంచాడు. పుత్తళిక మర్దిత హృదయంలో రెండు అంగుళీయాలు నాటుకున్నట్లు కన్పిస్తోంది. వివాహానంతరం ఇది బింబిసారుడిచ్చిన ఒక కానుక.

(సశేషం)



# వారఫలం

**14-10-1966 శుక్రవారం మొదలు 20-10-1966 గురువారం వరకు.**

**మేషం :** వ్యాపారంలో కొన్ని అవకాశాలు ఆకర్షణీయంగా కన్పిస్తాయి గాని అవి కార్యరూపాన్ని ధరించడం కష్టం. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. మిత్రులకు సహాయం చేస్తారు. వారం మధ్యలో ఆందోళన కలిగించే పరిస్థితులు యేర్పడతాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్య భారం పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృషభం :** ఏ వ్యవహారంలోను విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశం లేదు. ఆర్థిక వ్యవహారాల్లో మొగ మాటాలకు లొంగిపోవడం తగదు. సాహిత్య కళా రంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగు తుంది. కుటుంబ సంతోషం లభిస్తుంది. సంతానానికి కించిదనారోగ్యం చేయవచ్చును.

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది. అనుకూల వార్తలను వింటారు.

**మిథునం :** వృత్తి వ్యాపారాల్లో మీ శ్రమకు తగిన ప్రతిఫలం లభించగలదు. అధికారులవలన జరగ వలసిన వ్యవహారాల్లో మిత్రుల సహకారం లభిస్తుంది. ఉద్యోగంలో మీ పరిస్థితిబాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

స్త్రీలకు — బంధువులకు సహాయం చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :** వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. భారీ యెత్తున చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు — ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించవు.

**సింహం :** ఆదాయం మాట యెలాగఉన్నా అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకులాభించగలవు. ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. ఉద్యోగంలో మిత్రులకు సహాయం చేయగలరు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు — కుటుంబ కార్యక్రమాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**కన్య :** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరుతాయి గాని మీ స్వంతపనుల్లో శ్రమ కలుగుతుంది. అవసరానికి యేదో ఒక విధంగా డబ్బుచేతికి వస్తుంది. వృత్తిలో ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు — ఆరోగ్యం బాగానే ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

**తుల :** వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. కాని మొత్తం మీద ఆదాయం మాత్రం బాగా ఉంటుంది. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. సాంఘిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**వృశ్చికం :** వృత్తిలో యిదివరకు చేజారి పోయిన అవకాశాలు కూడా తిరిగి లభిస్తాయి. ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో యేర్పడిన ఆటంకాలు తొలగి పోతాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది. విలువైన వస్తువుల పోయే ప్రమాదంఉంది.

**ధనుస్సు :** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. వృత్తిలో వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం తగదు. అధిక వ్యయం జరగడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది.

స్త్రీలకు — కుటుంబ కార్యక్రమాలు శ్రమమీద నెరవేరుతాయి. పాటివారిలో గౌరవం లభిస్తుంది.

**మకరం :** వారం ప్రారంభంలో అన్ని వ్యవహారాలు అనుకూలంగానే ఉంటాయిగాని వారాంతంలో చికాకులు యేర్పడతాయి. మీ మంచితనాన్ని తమ స్వార్థానికి వినియోగించుకొనే వ్యక్తులతో వ్యవహరించవలసి వస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు — స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కుంభం :** మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. ప్రయాణాల్లో జాగ్రత్తగా వ్యవహరించడం మంచిది. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**మీనం :** వృత్తి వ్యాపారాల్లో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు ఫలిస్తాయి. అధికారుల వలన జరగ వలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. శుభకార్యాల విషయంలో బంధువుల సహకారం లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

—మహేష్




చిరుద్యోగింటికో పదయాన్నే ఓ పెద్ద మనిషొచ్చాడు. ఇతగాడు చిరుద్యోగికి చిర కాల స్నేహితుడు. చిరుద్యోగి మిత్రుణ్ణి వంటింటి ముందున్న 'హాల్లో' కల్చొకుని 'హల్లో, ఎప్పుడు రావటం' అన్నాడు. చిరు నవ్వు నవ్వుదామని ప్రయత్నం చేశాడు. అది వరకెప్పుడో చూసిన మొహం కావటం మూలాన చిరునవ్వుకి చిరుద్యోగి దగ్గర చనువు తగ్గిపోయింది. పూర్వం చుట్టం చూపుగా వచ్చేది. ఇప్పుడిటువేపు చుట్టం కూడా తగ్గించేసింది. అందుకే కొత్తమనిషి దగ్గర కెళ్ళాల్సిన కుర్రాడిలా మారాం చేస్తుంది. మారాం చేస్సిన ఓ ఘంట కొస్తే వొస్తుంది. దాని మారాం చూసి చిరుద్యోగి చిరాకుపడి దాన్నెప్పుడూ పిలవడు. ఇవ్వాళ పాత స్నేహితుడొచ్చాడు కదా చిరునవ్వు ప్రదర్శిద్దామని ప్రయత్నం చేసి లాభంలేదని తెల్సుకుని విరమించుకున్నాడు. చిరకాల స్నేహితుడు చిరునవ్వు నవ్వుతూ 'చిరుద్యోగీ! కులాసానా?' అన్నాడు. చిరుద్యోగి నిట్టూర్చాడు. చిరుద్యోగి [illegible] వచ్చేది నిట్టూర్పే. స్నేహం బాగా బల పడింది. నిట్టూరుస్తూ 'ఏదో ఇట్లా వున్నాను' అన్నాడు చిరుద్యోగి.

'అవును, నువ్విలాగే వుంటావు. నువ్వు మార్తానికీ జన్మలో మన కిచ్చిన టైం చాల్దు' అన్నాడు మిత్రుడు. అని నవ్వాడు. మళ్ళీ మళ్ళీ నవ్వాడు. చిరుద్యోగి వింతగా చూశాడు.

'ఏం, అలా వింతగా చూస్తున్నావ్. నేని ప్పుడు చేసిన శబ్దాన్ని 'నవ్వు' అంటారు... గుర్తొచ్చిందా? నువ్వెప్పుడో చేశావ్ అలాంటిశబ్దాన్ని. అందుకుని మర్చిపోయావ్' అన్నాడు మిత్రుడు. 'ఆ..గుర్తొస్తోంది.. అదే. నవ్వుకాదూ?.. అవున్నవ్వే' అన్నాడు గొణుక్కుంటూ చిరుద్యోగి. కాస్సేపు నవ్వు తెప్పిద్దామని ప్రయత్నం చేశాడు. ప్రయత్నం ఫలించక గుటకలు మింగాడు. చిరుద్యోగి ప్రయత్నాన్ని పసిగట్టాడు మిత్రుడు. 'లాభంలేదు.. నీ కిప్పుడప్పుడే ఆ నవ్వురాదు.. ఉట్టి కెక్కలేనమ్మ స్వర్గానికేం ఎక్కు తుంది.. ఇందాక చిరునవ్వు కోసం ప్రయత్నిస్తేనే నవ్వు దక్కలేదు. ఇక నవ్వెక్క డొస్తుంది.' అన్నాడు నవ్వుతూ మిత్రుడు, చిరుద్యోగి మిత్రుడు నవ్వు వంక ఆశగా చూశాడు. 'నువ్వు బాగా నవ్వుతావే' అన్నాడు, 'ఏం, నవ్వక.. నవ్వే నేను. నేనే నవ్వు'' అన్నాడు విలాసంగా మిత్రుడు. పైగా 'నువ్వా నవ్వు' అన్నాడు. చిరుద్యోగి పెదిమలు కదిల్చాడు. నిట్టూర్పుతో కలిసి నిరాశ బయటపడబోయింది. 'చిరుద్యోగి నాకు పుట్టువం పెట్టె నాక'ని కొట్టుకుంటూ వుం టయ్ నిరాశానిస్పృహలు. 'మీరిద్దరూ నాక్కావల్సిన వాళ్ళే పూరుకోండని' వాట్ని సర్దుతూంటాడు చిరుద్యోగి. ఈ రెండూ 'నేనం టెనేన'ని బయటికి రాబోతుంటే పరువుండదని పెదిమలు బిగించేసేడు చిరు ద్యోగి... కొంతసేపయ్యాక 'నువ్విప్పుడే పోస్టులో వున్నావ్?.. సూపర్నెంటయ్యా వుటుగా?' అని మిత్రుణ్ణడిగాడు చిరుద్యోగి.

'అహ .. జటేవాడివే... నువ్వెక్కడో ఇక్ష్వాకులకాలంలో వున్నావ్. నేను సూప ర్నెంటయ్యింది ఇప్పుడా? ఎప్పుడో ఆర్నెల్ల

క్రితం: ప్రమోషన్ నెక్స్టరిచి డిప్యూటీచీఫ్‌గా వుంటున్నాను' అన్నాడు మిత్రుడు. చిరు ద్యోగి ఆశ్చర్యపడ్డాడు. చిరుద్యోగి బట్టతల మీదున్న నాలుగువెంట్రుకలు 'ఈ మహాను భావుడెవరా? దర్శనంచేసుకుందాం' అని లేచి నిలబడి ఎగిరెగిరి చూస్తున్నాయ్..'నిజంగా' అన్నాడు చిరుద్యోగి.

'యింతలో అబద్ధ మేముంది? నిజం చెప్పకపోయేందుకు నువ్వేవన్నా యిన్ కంటా క్సాఫీసరువా?.. నెలక్రితం డెప్యూటీ చీఫ్ చేశారు. నాపాలసీ ఏ పోస్టుతోనూ ఆర్నెల్ల కంటె ఎక్కువుండకూడదని.. పీ మాదిరి దశాబ్దాలు ఒకే పోస్టుని కరుచుకూర్చోట్టం మన నేచర్‌కే విరుద్ధం.. వచ్చే ఏడు చీఫ్ అవుతాను' అన్నాడు మిత్రుడు.

మిత్రుడి పేరు విహంగరావు. అతనెగ ర్లేని ఎత్తుల్లేదు. ఎత్తులు వేస్తూ ఎగురుతూంటాడు. ఎగురుతూ ఎత్తుకెక్కే స్తాడు. ఎత్తుకెక్కి పైఎత్తు వేస్తాడు. 'బతకటం నేర్చుకోకుండా పుట్టటం ఎం దుకు? పుట్టి చేవలేక, చావలేక బతకటం ఎందుకు? బతకటం అంటె జీవించటం కాదు. జేబుల్నించటం' అన్నదే అతగాడి సిద్ధాంతం. బతక నేర్చినవాడు అంద ర్తోను, అందులో ఎక్కువగా పై ఆఫీసర్ల తోనూ అతుక్కుపోతాడు. అలాగే బతు క్కొస్తున్నాడు. పుట్టకపూర్వమే ఎలా బత కాలా అని ఆలోచించేవాడు. అతగాడు తండ్రి కంటె చదువుతో రెండుక్లాసు లెక్కువ, లౌక్యం లోపదాకు లెక్కువ చది వాడు. పుట్టూనె తండ్రంతటి వాడిగా పుట్టాడు. ఉయ్యాల్లో నిద్రపోతున్న వాణ్ణి చూసి ఓ ముసలావిడ ఏదో గొప్ప వన్నేస్తున్నాననుకొని 'తండ్రంత కొడుకు వీగా నాయినా' అని దీవిస్తే, యితగాడు ఉలిక్కిపళ్లేడపటం మొద లెట్టాడు. 'ఎందుకా ఎందుకా' అని సోదడిగారు. సోదిలో వచ్చిందంతా పిల్లాడి గురించే.

'యిప్పటికే నేతండ్రంతవాణ్ణయ్యాను. అంతే అవ్వమని అవ్వ దీవిస్తే నేను పుడ మిమ్మీద పుట్టి పొడి చెయ్యాల్సిందేవిటి?.. నన్నలా అవమానిస్తారా?' అని చెప్పింది సోదమ్మ.

తప్పయిపోయిందని ముసలమ్మ 'అలా గయితే నా తండ్రీ! మీనాయన్లాంటి వో వెయ్యిమంది మీద ఆఫీసరుగా రావాలి నువ్వు' అంది. అప్పటిగ్గాని ఏడుపు మాని నవ్వటం మొదలెట్టలేదు - విహంగరావు. అప్పుడు మొదలెట్టిన నవ్వు యిప్పుడ్దాకా నవ్వుతూనే వున్నాడు.. యితగాడు పుడ్తానికి ముందునించే లౌక్యంలో తండ్రి దగ్గర తర్ఫీదు పుచ్చుకున్నాడు. విహంగరావు తండ్రి శిఖండిరావు తన పనికోసం వెయ్యని వేషం వెయ్యని పాపంలేదు. అవతలివాణ్ణి ప్రసన్నం చేసుకునే విద్య ఉగ్గుపాల్తో వొచ్చింది. వాళ్ళమ్మ పాలు బట్టేప్పుడు పక్కింటి గంగా భాగీరథి సమానురాలు గోవిందమ్మగారు చెప్పే లోకాభి రామాయణం అంతా పాలా గటం మాని మరీ వినేవాట్ట..అలా శిఖండి రావు పుట్టిందగ్గర్నుంచి నిమిషం వృథా చెయ్యకుండా బ్రతుకుతెరువు విధానాలు తెల్సుకుంటె, విహంగరావు పుట్టకముందు స్నం చేసుకొన్నారు' అంటె నిద్ర కుప్రక్రి మిస్తున్న శిఖండిరావు అర్ధాంగి..యిహావి డికివన్నీ విని విని విసుగెత్తింది. అయినా హిందూధర్మ ప్రకారం భర్త కెదుర్చెప్పకుండా చెప్పేవన్నీ వినాలి కాబట్టి ఒక్క ప్రశ్న మాత్రం ఎదురు వేస్తుంది. దాంతో హిందూ ధర్మాన్నుద్ధరించాననుకొని, యిహా చెయ్యాల్సిందేమీ లేదని నిద్రపోతుంది. అదీ గాక ఒక ప్రశ్నిస్తే దానికి సమాధానం తెల్లారేంతవరకు చెపుతాడు శిఖండిరావు.

...శిఖండిరావు మొదలెట్టాడు. 'ఆ, అతగాడు నిజంగా కాలభైరవుడే.. బుర్రంతా (పిప్పిపులు) మయం. ముక్కుకు సూటిగా పోతాడు. సూదిలాంటి ముక్కు. మనకి ముక్కుచ్చింది సూటిగా పొమ్మనేనని అతడి



నుంచే నేర్చుకున్నాడు. అదెట్లాగంటె శిఖండిరావేదో ఆఫీసులో చాలా చిన్నపోస్టులో చేరి సూపర్నెంటయ్యాడు. రోజూ రాత్రి పడుకోబోయేముందు పెళ్ళాంతో తావా నాడు చేసిన ఘనకార్యాలన్నీ చెప్పేవాడు. పై ఆఫీసర్ల కిచ్చిన బుర్రెడు పళ్ల సంగతి. వాళ్ళ బుట్టలో పడ్డ సంగతి..అన్నీ చెప్పే వాడు..ఒకరాత్రి ఆ నాడ్చేసిన ఘనకార్యం గురించి చెపుతున్నాడు పెళ్ళాంతో.'.. నిన్న కొత్తగా వచ్చి చేరాడీ ఆఫీసరు..కాలభైరవ స్వామి.. అతగాడు రేప్పొద్దున్నే కార్లో మనింటికొచ్చి నన్ను తీసుకెడ్తానన్నాడు' అన్నాడు.

'అదేలాగండి.. ఆయన నిజంగా కాల భైరవుడే అన్నారుగా?.. ఆయన్నెలా ప్రస నమ్మకేం. ఏ విషయాన్ని కూడా చూడ కుండా పోనివ్వడు. పోనీ చూసింతర్వాతైనా చూళ్లేదనుకుని పోనివ్వచ్చు గదా? అలానూ చెయ్యడు. కళ్ళు మూసుకోడం అంటే ఏవిటో తెలియదు. నిద్రపోయేప్పుడిస్తే మెగతా ఎప్పుడూ చూస్తూ వుండాలన్నదే అతగాడి పద్ధతి. రూల్సుని రూల్సుగానే ప్రయోగిస్తాడు. రూల్సు మనం చేసు కున్నవే కదా మార్చుకోవచ్చన్న జ్ఞానం ఏ కోశానా కోసినా లేదు. 'సరళరేఖం టే ఎలా వుంటుందీ' అంటె కాలభైరవస్వామి అనుసరించే విధానం అని తక్కున చెప్పొచ్చు.. మొన్న ఛార్జి తీసుకుంటూనే ఏం చేశాడో తెల్సా? ఓ మీటింగు పెట్టాడు. తన క్కావల్సింది పని మాత్రమేనన్నాడు. 'మాసి

# చిరుద్యోగపర్వం

కాదని పుద్దేశ్యంలా వుంది. ఆఫీసు అతి వృద్ధే తనక్కావాలన్నాడు. దానికి తోడ్పడే ప్రతివాడికీ తను తోడుగా వుంటానన్నాడు. పని జాప్యం చేసేవాళ్ల మీద కఠిన చర్య తీసుకుంటానన్నాడు. యింకో మాటన్నాడు. తనని కల్సుకునేందుకు యింటికెవ్వరూ రావద్దన్నాడు. కల్సుకోదల్చిస్తే ఆఫీసులోనే నన్నాడు. తన కలాంటివి నచ్చవన్నాడు.. యితగాడివ్వాళ పొద్దున్నే యిక్కడో యిల్లద్దెకి తీసుకున్నాడు. యింకా పెళ్ళాంపిల్లల్ని తీసుకురాలేదు. ఓ పదిరోజుల్లో వస్తార్ట. నేను సాయంకాలం ఆయనింటి కెళ్ళాను. వరండాలో వున్న ప్యూన్తో నూపర్నెంటు శిఖండిరావు వొచ్చాడని చెప్పమన్నాను. లోపలి కెళ్ళిన ప్యూన్ తిరిగొచ్చి 'అయ్యగారు తమర్ని రేపాఫీసులో కల్సుకుంటాన'న్నారు అన్నాడు. నా దగ్గిరా కుప్పిగంతులు. అంతటితో తిరి గొస్తానికా యింటి దాకా వెళ్ళింది. 'యిది చాలా అర్జంటు. వారితో యిప్పుడే మాట్లాడాలి..ఆఫీస్సంగతి కాదని చెప్ప'మని ప్యూన్తో చెప్పి, లోపలికి వినిపించేట్టు 'రాత్రికి నువ్విక్కడే పడుకుంటున్నావా? యింటి కెడ్తున్నావా?' అన్నాను.

'యింటి కెడ్తానండి' అన్నాడు వాడు. యింకొంచెం గొంతెత్తి, 'ఎందుకైనా మంచిది, నువ్వు కూడా యిక్కడే పడుకో.. ఆఫీసరుగారొక్కరే వుండాల్సొస్తుంది పాపం.. అదీగాక యీయిల్లు.. అవన్నీ ఎందుకులే గానీ.. నువ్విక్కడ పడుకో యీరాత్రికి' అన్నాను. దాంతో లోపల్నుంచి కాలభైరవ స్వామి పరిగెత్తుకుంటూ వచ్చాడు... ఏది.. అంతకుముందు 'రేపాఫీసులో కల్సుకో' మన్నాడే.. అప్పు..హ..హ పెద్దమనిషి.. పరిగెత్తుకొచ్చాడు.. వింటున్నావా?' అంటూ పెళ్ళాం వంక చూశాడు శిఖండిరావు. పెళ్ళాం నిద్రపోతోంది.. 'ఓసీ నిద్రమొహమా, 'ఊఁ' కొడ్తూనే నిద్రపోతున్నావ్' అంటూ మంచం మీంచి లేచాడు శిఖండిరావు. అతగాడు లేచ్చుండగానే 'నాన్నేయ్' అన్న కేక వినిపించింది. 'ఎటువేపు నుంచీ యీకేక' అని చుట్టూ చూశాడు శిఖండిరావు. పెళ్ళాం పడుకున్న మంచం వేపునుంచి విని పిస్తోందికేక. శిఖండిరావు పెళ్ళాం విహంగరావుని కడుపుతో వుంది. ఏడిమిదో నెల..

'నాన్నా, నేను. నీ పుట్టబోయే కొడుకుని.. అమ్మ యిప్పుడేమిటి? గంట క్రితమే నిద్రపోయింది. యిందాకట్నించి నేనే 'ఊఁ' కొడ్తున్నా. తర్వాతేం చేశావో చెప్పు.. లేకపోతే నాపని అభిమన్యుళ్ళా అవుతుంది' అన్నాడు లోపలున్న విహంగరావు.

'హారినీ, శిఖండిరావు కొడుకువనిపించావ్.. సరే చెవుతా విను.. అలా వరండాలోకి పరిగెత్తుకొచ్చిన ఆఫీసరుగారు 'అయ్యో, శిఖండిరావుగారూ! ఏవిటా అర్జెంట్ విషయం' అన్నాడు. 'అయ్యో, లోపలికి, పదండి.. యిక్కడకాదు' అని ఆయన్ని లోపలికి లాక్కెళ్ళి 'యీ యిల్లెవరు కుదిర్చారు?' అన్నాను. అప్పే, నేనే వెతుక్కున్నాను. అన్నీ బాగున్నయ్యని అద్దెనిచ్చేశాను' అన్నాడు.

'కొంపదీశారు. మీకు పిల్లాజెల్లా కలవారు. యీ యిల్లు ఖాళీగా ఎందుకుంటను కున్నారు?... దీంట్లో కొన్నాళ్ళ కిందట్ ఆడపిల్ల ఆత్మహత్య చేసుకుంది. అది దయ్యమై తిరుగుతోంది. ఫామిలీస్తేసుకు రాలేదింకా నయం గుడ్డిలో మెల్ల' అన్నాను.

'అయితే యిపుడేం చేద్దామంటారు' అన్నా డాయన.

'అద్దెమ్మ పోతేపోయిందిగానీ... యీ రాత్రికే నేనో యిల్లు చూస్తాను. రేపొద్దున్నే దాంట్లో చేరండి' అన్నాను. దాంతో ఆయన 'రక్షించారు. పిల్లాజెల్లా వచ్చేదాకా వుంటె నాపాట్లు ఆ దేవుడి క్కూడా తెలిసేవి గావు' అన్నాడు.

'కాదుటండీ మరి.. నేనందుకే మీరున్న హోటలు కెళ్ళి మీరు ఖాళీ చేశారని విని ఎక్కడ చేరారా అని కనుక్కుంటె యిక్కడని తెల్సింది... దాంతో కాళ్ళాడక అంగారుగా యిటొచ్చాను. మీకొక్కరికే గదా పాపం' అన్నాను ఆయన్దాంతో ఎంతో కృతజ్ఞతతో 'చాలా థాంక్సండీ' అన్నాడు.

'అయ్యో, మీరలా థాంక్సంటె నాకు చాలా 'యిది'గా వుంటుంది. మా ఆఫీసరు గారికి చెయ్యాల్సిన కనీస సేవ యిది. సరే, అవన్నీ తర్వాత.. యీ రాత్రికి మేము,ప్యూను యిక్కడే పడుకొంటాం. నేనిప్పుడే యింటి కెళ్ళి భోంచేసి పరిగెత్తుకొస్తాను' అని లేచాను.

'నమ్మండి.. నేనూ యీ ప్యూన్ని పంపించేసి యిద్దర్నీకి హోటలు కెళ్ళి పడుకుంటాను. మీరు మాత్రం పొద్దున్నే యిల్లు చెతికి పెట్టాలి. మేము రేపొద్దున్న కొత్తయింటి కెళ్లి ఆ యింటికొస్తాను. యీ ప్యూన్కి తెల్సుగా మీ యిల్లు.. మనిద్దరం కలిసి యిల్లు వెతుకుదాం' అన్నాడు.

'అయ్యో, నే నివ్వాళ రాత్రి ఒంటి గంటయినా వెతికి యిల్లురడీ చేస్తాను. పొద్దున్నే మీరు రావటం ఎందుకు?.. మీ హోటలికి ముందు నాలుగ్గంటలకు కొచ్చి నేనే కనుక్కుంటాను' అన్నాను.

'ఆ, ఎందుకులెండి.. కారుందిగా నేనే వొస్తా.. యిల్లు మాత్రం కాస్త తొందరగా చూడండి' అన్నాడు.

'..మీకు మరి మరి చెప్పాలా? యిప్పుడెళ్ళి కుదుర్చుకునిగాని యింటి కెళ్ళను. వస్తా' అన్నాను.

లోపల్నుంచి వింటున్న విహంగరావు నవ్వుతూ అన్నాడు, 'నాన్నా.. మరి, ఆ యింట్లో ఆత్మహత్య సంగతి.. నోట్లోదే కదూ.'

'అది నేనే చెప్పారా పుట్టబోయే నానా' అన్నాడు శిఖండిరావు.

'నాన్నేమ్, యింకో సంగతి.. యిందాక మాయమ్మ వాళ్ళు వూరికే వివరంగా వున్నవి, అక్కడెవ్వరూ రావత్తే దని అమ్మతో చెప్తున్నారు. అది కుదర్చరావా? ఆయన లేకుండి కనక దానైనా ఫర్వాలేదను.'' అన్నాడు పుట్టబోయే సుపుత్రుడు విహంగరావు.

'ఓర్రి, అప్పుడే అవీ కనిపెట్టావ్. సరే, అవనీ చేద్దాం. అన్నట్టే, యిందాక అభిమన్యుడంటున్నా.. వాడి సంగతెట్టా తెల్సింది నీ కప్పుడే' అన్నాడు శిఖండిరావు.

'గుళ్లో శాస్త్ర్లుగారు పురాణం చెవుతున్నారుగా. రోజూ అమ్మెడుతోంది.అక్కడ విన్నా' అన్నాడు విహంగరావు.

'హోర్నీ.. చదువంతా పుట్టకముందే నేర్చుకుంటున్నావ్.. సరే, రా.. పుట్టంగానే పున్యాగంతో చేర్పిస్తా' అన్నాడు శిఖండిరావు. అని గదిలోంచి బయటికెళ్ళాడు.

యిలా బతుకుతెరువుకు బాటలన్నీ బయటికి రాకముందే తెల్సుకున్నాడు విహంగరావు. పుట్టకముందే యింకో పన్జేశాడు. తను పుట్టేప్పుడయ్యే ఖర్చుకి డబ్బెట్లా కూడ్చుకోవాలా అని ఆలోచించాక ప్లాన్ వేశాడు. రాత్రిళ్ళు చేసే రహస్య సమాలోచనల్లో ఒకరోజు తండ్రికి సలహా యిచ్చాడు. శిఖండిరావు బావమర్ది, విహంగరావు మేన

కూనా అయితే ఓ పెద్దమనిషి చెల్లెలికి కూతురు పుడితే తన కొడుక్కి చేసుకుందామని మహా యిదై పోతున్నాట్ట. అతగాడికో జోతిష్కుడు చెల్లెలికి కూతురే పుడుతుందని చెప్పాట్ట. అదోక రోజున చెల్లెల్తో చెపుతుంటె విహంగరావు విన్నాడు. మర్నాడు రాత్రి తండ్రితో చెప్పాడు.

'సరే, మావయ్య కూతురేపుడుతుందంటున్నాడు. కూతురు కాదు, కొడుకేనని నువ్వు పందెం కట్టు. మావయ్య జోతిష్కుడి మాట భరోసాతో పందెంకడ్తాడు. పందెం కడ్తాడని ఎంతో ఎక్కువ కట్టకు. పందెం ఎక్కువైన కొద్దీ ఎగేస్తాని కవకాశం ఎక్కువ. అందుకని ఓ రెండొందలు కట్టు చాలు. అంతకంటె ఎక్కువ కట్టొద్దని మళ్ళీ యింకో ఆలోచన చెప్పాడు. 'మావయ్యని గుళ్ళో కూర్చోపెట్టి పందెం మాటను. గుళ్ళో యిచ్చిన మాటని మావయ్య తప్పడు' అని.

శిఖండిరావు విహంగరావుని తెగమెచ్చుకున్నాడు. మళ్ళీ ఓ అనుమానం వొచ్చి. 'సరే అబ్బాయ్, నువ్వు నిజంగా మొగపిల్లాడివేనా?..అహా.. ఏంలేదు.. పందెం కూడా కడ్తున్నావా మరి.. అదీగాక జోతిష్కుడు చెప్పాడంటున్నావ్' అన్నాడు.

'అదేమిటి, నాన్నా! అంతమాటన్నావ్.. అసలుకే నీకామాత్రం తెలీదా? ఆడాళ్ళ కడుపై ఏళ్ళొచ్చినా తెలివిరాదుగందా. నేను నీకు కనబడకుండా అమ్మచేత కనబడకుండా పుట్టినప్పుడే యింత తెలివుంది. ఆడపిల్లయితే నాకింత తెలివి వొస్తుందా' అన్నాడు విహంగరావు.

'అవున్నే, నువ్వు చెప్పింది నిజమే' అన్నాడు శిఖండిరావు.

'అదేంటి నాన్నా..నే చెప్పిందే నిజం.. యింకోటి కాద'న్నాడు విహంగరావు. అలా పుట్టినప్పుడే డబ్బు చేతికందిచ్చిన కొడుకుని మురిసిపోయాడు శిఖండిరావు.

పుట్టా యింకో సహాయం చేశాడు తండ్రికి. పెళ్ళాం నొప్పులు పడుతుంటె మంత్రసాన్ని తీసుకొచ్చాడు శిఖండిరావు.. మళ్ళీ అదెందుకు? డబ్బుఖర్చు' అని విహంగరావు లోపల్నుంచరుస్తున్నా పెళ్ళాం చేసే ఏడుపులో శిఖండిరావు వినిపించుకోలేదు. అందుకని మంత్రసాన్ని పిలిపించాడు. 'యిహాగాదు. యిప్పుడు వీళ్ళు వినిపించుకునేట్టు లేద'ని నిలువుగా వున్న వాడల్లా అడ్డం తిరిగాడు విహంగరావు. 'అయ్యో, బిడ్డడ్డం తిరిగింది.. యిహ నావల్లకాదు. సరిగా పుడితే సరిగాని లేకపోతే నా మంత్రం పనిచెయ్యదు' అంది మంత్రసాని. 'ఏ ఆస్పత్రికో తీసికెళ్ళండని అదెళ్ళిపోయింది. దాన్ని వెళ్ళనిచ్చి అడ్డంగా వున్న వాడల్లా నిలువుగా వచ్చాడు విహంగరావు..! యింకో సంగతి.. పుట్టినప్పుడు విహంగరావు 'కేర్, కేర్' అనకుండా 'సార్, సార్' అన్నాట్ట. యిన్ని నిదర్శనాలయ్యాక కొడుకు మీద నమ్మకం బాగా కుదిరింది శిఖండిరావుకి. 'నాకు రెండోవాణ్ణి గురించేం బెంగలేదు. ఆ పెద్దాడితోనే గొడవ. వాడొట్టి మాయకుడు' అని వాపోయేవాడు శిఖండిరావు. పెద్ద కొడుకు పేరు ధర్మారావు. చిన్నప్పట్నుంచీ కూడా నోట్లోవేలెడితే కొరకటం చేతయ్యేది కాదు. అందుకని ప్రతివాళ్ళూ నోట్లో వేళ్ళు పెట్టేవాళ్ళు. అలా వేళ్ళు పెట్టినప్పుడు నాలిక లాగేశారో ఏమోగాని పెద్దయ్యాక 'వాడికి నోట్లో నాలిక లేదన్నా'రందరూ. నిజమేననుకుని ధర్మారావెవరితోనూ మాట్లాడేవాడు కాదు. క్లాసులో ఎప్పుడూ ఫస్టు మార్కులు మాత్రం వచ్చేవి. విహంగరావు యస్సెల్సీ దగ్గర నాలుగేళ్ళు పట్టి అయిదో ఏడు ఎలా పేసయ్యాడో పేసయ్యాడు. పి. యు. సి.లో చేరి పుస్తకం తెరవకుండా పేసయ్యాడు. 'ఎట్టా పేసయ్యావురా చిన్నోడా? ఎవర్నడిగినా నువ్వు పుస్తకం తెరవ్వన్నా'రని శిఖండిరావడిగితే, 'అదంతా అబద్ధం.. నేను పుస్తకం తెరవకపోవటమేమిటి?.. పరీక్ష హాల్లో సుబ్బరంగా తెరిచాను' అన్నాడు విహంగరావు...

అప్పటికి ధర్మారావు యం. కాం. పేసయ్యాడు. యూనివర్సిటీలో రేంకొచ్చింది. ఉద్యోగం కోసం వూరూరా తిరుగుతున్నాడు. ఎక్కడా దొరకలేదు. 'చిన్నోడా, పి. యు. సి. అయ్యింది గందా, బియ్యేలో చేర్తావా?' అని శిఖండిరావడిగితే 'నేచేర్ను. వుద్యోగంలో చేర్తాను. రెండేళ్ళల్లో ఆఫీసర్నయి అన్నయ్యన్ని కిందేసుకుంటా' నన్నాడు విహంగరావు. 'సరే' నని క్లర్కుగా చేర్పించాడు శిఖండిరావు. 'ధర్మారావు నేం చెయ్యాలా' అని మథనపడేవాడు శిఖండిరావు. 'యిలాంటి వాడికే వుద్యోగంలాకియ్యా' అని చూశాడు. ఏ వుద్యోగంలో చేస్తావురా' అంటె 'లెక్చెరర్' అన్నాడు ధర్మారావు. 'బెస్టు. దాంట్లో చేరు. నీలాంటి రహదారి రోడ్లంట తిరిగి అడ్డరోడ్డంటె అర్థం తెలియని వాళ్ళకదేలాకి. తనకున్నదేమిటో అవతలి వాళ్ళకివ్వటమేగాని, అవతలి వాళ్ళ దగ్గర్నుంచి గుంజలేకపోవటం కాకుండా తమకి రావాల్సింది కూడా తెచ్చుకోలేని వాళ్ళు లెక్చెరర్లుగానే వుండాలి. అందుకేగా మరి ప్రతివాడూ ప్రభుత్వాన్ని కూడా బెదిరించి జీతాలెక్కువ చేయించుకుటుంటే వీళ్ళేమన్నా చెయ్యగల్గుతున్నారా? గొర్రెతోకల్లాంటి జీతాల్ని పట్టుకువేళ్ళాడుతున్నారు. అసలు గొర్రెతోక్కంటె తక్కువేట కూడా. ఆ సంగతి మొన్న తెల్సింది... 'గొర్రెతోకంటి జీతాలి లెక్చెరర్లవి, పాపం,' అంటె దారేపోయే గొర్రెపోతొకటి పొడ వచ్చింది. 'నాతోకేం అంత పొట్టిది కాదు. యింకా పెద్దదే' అంటూ. ఎడాపెడా తోకాడించిందింకా పైగా.. అందుకని, నీ లాంటివాడికదే లాకి. దాంట్లోనే చేరు' అని లెక్చెరర్‌గా చేర్పించాడు.. యిప్పుడు విహంగరావాఫీసరై అన్నకింతో అంతో నెల నెలా పంపిస్తున్నాడు...

అలాటి విహంగరావు అలా అలల్లాగా లేస్తూ, వాటి మాదిరే పడిపోకుండా అంత వాడయ్యాడు. అతగాడి గొప్పంతా విన్న చిరుద్యోగర్థాంగి 'అతగాణ్ణిచూసన్నా నేర్చుకోరాదుటండీ?' అంది మొగుణ్ణి వంటింటోకి పిల్చి, ఆ మాటలు విని విహంగరావు వంటింట్లో కెళ్ళి 'చెల్లెమ్మా! వాడికొకళ్ళన్జూసి నేర్చుకునే తెలివెక్కడుంది?..ఎదుటి వాళ్ళన్జూసి నవ్వటం మాటటుంచి, వాళ్ళ నవ్వు చూసి తన్నవ్వటం కూడా తెల్సుకోలేడు. యిందాకణ్ణుంచి నవ్వటం కోసం తెగ తాపత్రయపడుతున్నాడు. కాని ఏం లాభం?.. నేను కాబట్టి సరిపోయింది. లేకపోతే నవ్వు పలక్క నవ్వులపాలయ్యేవాడు కాదూ?.. ఒరేయ్ చిరుద్యోగీ! పక్కవాడు నవ్వితే నవ్వటం తెలుసుకోలేకపోతే ఎల్లాగరా? ఓ పన్జెయ్యి.. యింగ్లీషు సినిమాలకెళ్ళటం మొదలెట్టు. పక్కసీట్లో వాడ్నవ్వితే పక్కలెగిరేట్టు పగలబడి నువ్వూ నవ్వటం ఎట్టాగో నేర్చుకోవచ్చు... చెల్లెమ్మా! వీణ్ణి మరామ్మత్తు చేస్తానికే యీ వూరొచ్చాను. ముందు మాకన్నం వడ్డించు. భోంచేశాక వీడి బూజొదల గొడ్తాను' అన్నాడు విహంగరావు.

భోజనం కానిచ్చి, తల దిండుకానించి పక్కపోడి నవుల్తూ వుపోద్ఘాతం మొద

# చిరుద్యోగపర్వం

చెట్టాడు విహంగరావు. చిరుద్యోగొచ్చి పక్కగా కూర్చున్నాడు. చిరుద్యోగర్ధాంగి పెన్ను, కాగితం తెచ్చి 'జాగర్తగా రాసుకోండన్ని' అని చిరుద్యోగి చేతిలోపెట్టింది. విహంగరావు మొద లెట్టాడు: 'చిరుద్యోగీ! చెప్పేదంతా జాగర్తగా విని 'ఛ.ఛ' అనకుండా 'తు.చ' తప్పకుండా ఆచరించు. ఆచరించి మళ్ళీ ఏడాదికి మనిషివవ్వు. పై ఏడాదికి పెద్ద మనిషివవ్వు.... జాగర్తగా విను. తెలియనప్పుడు అడుగు. తలాడిస్తూ కూర్చోకు......

ప్రపంచంతో ముందన్ని సృష్టించిం తర్వాతే మనిషిని పుట్టించాడు బ్రహ్మ. ఎందుకనుకున్నావు? వీళ్ళొట్టి అమాయకులు. ఎట్టా బతకాలో తెలియదు. ప్రకృతిని చూసైనా కాపీ కొట్టి బతకటం నేర్చుకుంటారని. బతకటానికేం చేయాలో నేర్చుకోమనే సముద్రాన్ని దాంట్లో కెరటాల్ని, గాలిని గాలివాలుని, నదినీ నదితో వరదనీ, పువ్వుని దాని మీదకొచ్చే తుమ్మెదనీ, తీగెని చెట్టునీ..... అలా యింకెన్నిటినో సృష్టించాడు. కాపీ చెయ్యండి వీట్నని ఆదేశించాడు. ప్రకృతి ధర్మాన్ని పాలించం డన్నాడు. పాలిస్తే బతగ్గల్గుతారు. లేక పోతే లేరు. ప్రకృతి ధర్మం ఏమిటో తెల్సా? 'నీకొచ్చిన పని నే చెయ్యాలంటె నాచుట్టూ తిరగా ల'న్నదే ప్రకృతి ధర్మం. భూమి సూర్యుడి చుట్టూ తిరుగుతోంది. విరామం లేకుండా ప్రదక్షిణాలు చేస్తోంది. ఎందుకు? సూర్యుడి దగ్గర్నుంచి వెలుగ్గావాలి. పువ్వులో వున్న తేనె తుమ్మెదక్కావాలి. అందుకే పువ్వు దగ్గర కొచ్చి దాన్చుట్టూ ప్రదక్షిణం చేస్తుంది. పువ్వున్నది చెట్టుకయినా చెట్టు చుట్టూ ప్రదక్షిణం చెయ్యదు. ఎందుకని? అది నీలాటి మనిషి కాదు కాబట్టి. ఆఫీసు పన్చేస్తే ఆఫీసరు ప్రమోషనిస్తాడా? అలానే చెట్టుచుట్టూ తిరిగితే తుమ్మెదకి తేనె దొరుకు తుందా? ఆఫీసరు చెప్పెయ్యకుండా ఆఫీసు పన్చేస్తున్నా ఆఫీసరు చుట్టూ తిరక్కుండా ఆఫీసుచుట్టూ తిరిగితేనూ నీకు ప్రమోషనెంతొస్తుందో తుమ్మెదక్కూడా పువ్వు చుట్టూ తిరక్కుండా చెట్టు చుట్టూ తిరిగితే తేనె కూడా అంతే దొరుకుతుంది. అందుకే చెట్టు నొదిలి పువ్వుచుట్టూ తిరుగుతుంది. కాబట్టి, ఓ చిరుద్యోగీ! ఏది ముఖ్యం — చెట్టా — పువ్వా? ఆఫీసా — ఆఫీసరా?

తీగేం చేస్తుంది? పైకెళ్ళాలని ఆశ కాని తనంతట తానెళ్ళ లేదని తెల్సు. అందుకే ఓ చెట్టుని పట్టుకుంటుంది. దాన్చుట్టూ చుట్టు కుంటుంది. చెట్టెంత ఎత్తుంటె అంతెత్తూ ఎదుగుతుంది. కాబట్టి, చిరుద్యోగీ! నువ్వూ ఓ ఆఫీసర్ని పట్టుకో. అతగాడికి చుట్టుకో. అట్లా అతగాణ్ణాకట్టుకో. దాంతో అతగాడే నిన్ను పైకి నెట్టు తాంటాడు. ఆఫీసు పని, ఫైళ్ళపని బాగా చూస్తుంటే పైకెడ్తాననుకోకు. ఫైళ్ళ పన్చేస్తూ వుంటె అవే పెరుగుతయ్ గాని నువ్వు పెరగవ్. ఆఫీసరు పనులు చూస్తుంటె నువ్వు పెరుగుతావ్, నీ ఫైళ్ళు తరుగుతయ్ తెల్సిందా' అని విహంగరావు దిండు సద్దుకున్నాడు.

'నా అంతట నేను స్వశక్తి మీద పైకెళ్ళాల్సిందే తప్ప యిలాంటివి నాకు నచ్చవ్', అన్నాడు చిరుద్యోగి.

'అలాంటి నినాదాలే నాకు నచ్చవ్...' ఏమిటి స్వశక్తంటె? నీ కెంత శక్తుందో కొలిచే తిరిక, ఓపిక ఆఫీసరు కెందుకుండాలి? నువ్వు శక్తంతా కూడగట్టుకుని ఫైళ్ళకి ఫైళ్ళు లేపేస్తుంటె అతగాడికేం ఒరిగింది? అతగాడి జీతమేమన్నా పెరిగిందా? కాబట్టి ఆఫీసరు చూసేది నీకు శక్తుందా? లేదా? అని కాదు. అతగాడి మీద నీకు భక్తుందా? లేదా? అని.... అదిగాక నీ శక్తితో పైకి వెళ్ళాలనే మాట కలమాత్రమే... యీ ప్రపంచం సముద్రం లాంటిది. ఒడ్డున పడే సంగతాలోచించాలి గాని ఎలా పడా లన్నది కాదు. దార్లేవైనా గమ్యం మాత్రం ఒక్కటే— బతకటం. సముద్రం లోంచి బయటికి రావాలంటే యీదుతూ కూర్చుంటావా? అలా యీదుతూవుంటె ఒడ్డుకి రాగలవా? అందుకే యింతక్కా వచ్చే పెద్ద అలవొళ్ళో కూర్చుంటే ఒడ్డు కీడ్చుకొస్తుంది. అట్లానే ఆఫీసరు ఒళ్ళో కూర్చుని పైకెళ్ళాలి....' అని ఆగాడు విహంగరావు. చిరుద్యోగి వంక చూశాడు. చిరుద్యోగిలో కొంచెం చైతన్యం

వచ్చింది. బట్ట తల మీదున్న నాలుగు వెంట్రుకలు పైకీ కిందికీ వూగుతున్నయ్ 'అంటె చిరుద్యోగి ఆలోచిస్తున్నాడన్న మాట. పర్వాలేదు. దార్లో కొస్తున్నాడు' అనుకున్నాడు విహంగరావు... చిరుద్యోగి తలూపాడు... అర్థమయిందిలా వుంది.

'ధర్మం చచ్చి పోయింది... దేవుళ్లేడు, ధర్మం లేదు... అంతా కలికాలం' అన్నాడు ఆవేశంగా చిరుద్యోగి.

విహంగరా వందుకున్నాడు: 'ధర్మం చచ్చి పోయిందన్నావే... దానికి నేనూ ఒప్పుకుంటాను. అయినా చచ్చిన వాళ్లతో చస్తామా? చచ్చిన వాళ్లని బతికించ గలవా? మనం చావకుండా చూసుకుంటె చాలు. కాలం ప్రవాహం లాంటిది. ధర్మం పుట్టి దాంట్లోంచి కాలం అనే ప్రవాహం పుట్టింది. యుగాలు గడుస్తున్న కొద్దీ కాల ప్రవాహానికీ ధర్మానికీ దూరం పెరిగింది. యిప్పుడు ధర్మం కనుచూపు మేర్లో కూడా లేదు. ఈ దూరం తగ్గించటం నీ వల్లా... నీ పక్కోడి వల్లా... అయ్యే పనా? అందుకని ధర్మం, ధర్మం అంటూ వెనక్కి చూస్తూ కాల ప్రవాహానికి ఎదురీదకు. దాని వరవడిలో పోతూ వుండు... అయినా ధర్మానికో నిర్దుష్టమైన నిర్వచనం వుందా? కాలాన్ని బట్టి ధర్మం యొక్క నిర్వచనం, దాని స్వరూపం మారుతున్నయ్.... అందుకని ప్రిన్సిపుల్సులో రిజిడిటీ ఎప్పుడూ వుంచుకోకు. ప్రవాహం ఎటు తిరిగితే అటు వేసే గమ్యం వుండాలి. అప్పుడే నువ్వు ఒడ్డు కెక్కుతావ్, తెల్సిందా?.... అదీ గాక ధర్మం చచ్చిపోయింది. ఎవడిధర్మం వాడు చెయ్యట్లేదు. దేవుడేదో చేస్తాడని ఎదురు చూట్టం తప్పు. దేవుడు లేడని ప్రచారం చెయ్యటం అపచారం. గీతలో ఏవన్నాడు? 'ధర్మం ఎక్కడుంటె అక్కడే నేనుంటా' నన్నాడు. నీ ధర్మం నువ్వు చెయ్యి, నీ దగ్గిరే వుంటాడు దేవుడు. నీ ధర్మం ఏవిటి? ఆఫీసరు చుట్టూ ప్రదక్షిణం చెయ్యటం, అదే యుగ ధర్మం. నువ్వా పన్జేస్తే నీ దగ్గిరే వుంటాడు దేవుడు. యింకో తప్పుడు ప్రచారంవుంది— యిలాంటి పన్లు కలికాలంలోనేనని. యీ పన్లకి కాలం, స్థలం అని భేదంలేదు. దేవుళ్లు కూడా యిలాంటివి చేశారు తెల్సా?... నీకాసంగతి తెలియదులా వుంది. పూర్వం కైలాసంలో ఏం జరిగింది? గణాధిపతి పోస్టుఫిల్ చెయ్యాల్సొచ్చింది. వినాయకుడు, కుమారస్వామి పోటీలో నిల్చారు. పోస్టుక్కావల్సిన అర్హత ఏమిటంటె— ప్రపంచం అంతా తిరిగి ముందుగా రావాలని. ఎవడు ముందొస్తే వాడిదే పోస్టు. ప్రపంచం అంతా తిరిగొచ్చేస్తే వుద్యోగం వస్తుందని పరిగెట్టుకెళ్లి పోయాట్ట కుమారస్వామి. కుమారస్వామి కూడా వెర్రిబాగులాడు నీలాగే. నువ్వనుకోటల్లా — 'ప్రమోషనాలంటె రాత్రి పదింటి దాకా పన్చెయ్యాల'ని అలాగే కుమారస్వామి కూడా 'నిజమే.... ప్రపంచం అంతా తిరిగొస్తేగాని ఆ వుద్యోగం రాదు' అనుకుని ప్రతి నది లోనూ మునుగుతూ ఒక్కొక్క టెస్టిమోనియల్ తీసుకుంటున్నాట్ట. యీ లోపల వినాయకుడేం చేశాడు అనుకున్నావ్.. వినాయకుడు గడుసు వాడు. కుమారస్వామి నవెళ్లనిచ్చి పార్వతీ పరమేశ్వరుల చుట్టూ తిరుగుతూ భజన చెయ్యటం మొదలెట్టాడు. పరమేశ్వరుడు పరమానందించాడు. 'నాయినా! గణపతీ! ధర్మ సూక్ష్మం తెలిసినవాడివి. నిన్నే గణాధిపతి జేస్తున్నా' నన్నాడు. కుమారస్వామి రొప్పుతూ రోజుతూ వచ్చాడు.... ఏం లాభం?.... కాబట్టి ఆఫీసర్ల చుట్టూ తిరగటం అనేది కలికాలంలోనే వచ్చిందనుకున్నావా? ఎప్పట్నుంచో వుంది. అదే ధర్మం అని దేవుళ్లు కూడా ఒప్పుకున్నారు. యిప్పటికైనా సత్యాన్నిగుర్తించు' అన్నాడు మంచం మీద లేచి కూర్చుంటూ విహంగరావు.

చిరుద్యోగి మిత్రుణ్ని కౌగలించుకున్నాడు. 'జ్ఞాన నేత్రం ప్రసాదించావన్నాడు. చీకట్లోంచి వెలుగులోకి తీసుకొచ్చావన్నాడు. యింట్లో పెట్టి కొల్చుకుంటా నన్నాడు. నీ అంతటివాడులేడన్నాడు. యింకా ఏమేమిటో అన్నాడు. విహంగరావు ఆ మాటల్నీ మళ్లీ అనమన్నాడు. మళ్లీ మళ్లీ అనిపించాడు. చివరికన్నాడు 'యివన్నీ నీతో చెప్పి చెప్పించు కుంటున్నాననుకోకు..., యీ మాటలే మా ఆఫీసరు దగ్గిర కూడా అనాలి. అందుకే నాలుగయిదు వలు రిహార్సల్సు వేయించాను. యిహ బయల్దేరు. నీ కడ్డులేదు' అని...... విహంగరావు బయల్దేరాడు. చిరుద్యోగి అర్ధాంగి చిరుద్యోగిని లోపలికి పిల్చి 'ఆయనో స్టేషను కెళ్లారాదుటండీ!... మర్యాదగానూ వుంటుంది. దార్లో యింకా బోల్డు చెప్పించుకోవచ్చు' అంది. విహంగరావు గుసగుసలు విని 'చెల్లెమ్మా! మీ కంటె నే చెప్పిన పాఠం నీకు తొందరగా వట్టు బడింది. దాన్నట్టాగే పట్టుకో. యిహ రోజూ నువ్వు కూడా వీడికి ట్రయినింగిస్తూవుండు' అని చిరుద్యోగిని తీసుకుని స్టేషన్‌కు బయల్దేరాడు. దార్లో యింకా ఎన్నో విషయాలు చెప్పాడు... రైలు కదుల్తూండగా 'త్వరలో ఆఫీసరు నీ బుట్టలో పడా' అని విష్‌చేసి 'త్వరలో ఆఫీసరు పోస్టు ప్రాప్తిరస్తు' అని దీవించాడు విహంగరావు.

'అంతా నీ చలవ' అన్నాడు చిరుద్యోగి. చిరునవ్వు నవ్వాడు.

'నువ్వెక్కణ్నుంచి వొచ్చావిప్పుడు?' అని ఆశ్చర్య పోయాడు చిరుద్యోగి.

'ఆ దార్లో పడ్డావ్... యిహ ఫర్వా లేదు' అని చెయ్యూపుతూ రైల్లో వెళ్లిపోయాడు విహంగరావు. **(ఇంకా ఉంది)**

పెద్దమనిషి — పులిచెర్ల

రేపిస్తాను-ఎల్లుండిస్తాను-అనటమే గాని-ఇంతవరకుబాకీ తీర్చనే లేదు! ఇలా అబద్ధాలు చెబితే ఎలాగోయ్!

అసలు నేను మీదగ్గర అప్పు తీస్కోనే లేదు...




"చా! కాపి తెస్తునా సాప్!"

"కాపి తెస్తునా, చా కావాలా?"

"వక్క పలుకు వద్దా?"

"సిగరెట్టు వుందా?"

అస్తమానం ఏదో ఒకటి మాట్లాడుతూ వుండకపోతే తోచదు, చొక్కమ్మకు. అదో జబ్బుగా తయారయింది. మిగత అన్నిటోన్నూ బంగారం లాంటిది చొక్కమ్మ. అంత పెద్ద మద్రాసు పట్నంలో అలాటి మనిషి దొరకనే దొరకదు మరి.

మాంచి నమ్మకమైన మనిషి. ఎదురుగా కనిపిస్తున్న నయాపైసా ముట్టుకోదు. శుభ్రంగా పని చేసేది. నేను ఇస్తున్న ఎనిమిది రూపాయిలకు ఇంత నమ్మకమైన వారు మరెవరు దొరుకుతారు. అందులో మద్రాసులో!

ఆ వయసుకే అంత శాంతం, ఓర్పు సహనం ఎలా వచ్చిందో మరి? బీదదే కావచ్చు — కాని గుణానికి కాదు.

కాని అస్తమానం వాగుతూవుండే జబ్బుకు మందో?

కాఫీ తెచ్చి బల్లమీద పెట్టింది. టీ తెమ్మన్నాను. కాఫీ తెచ్చింది. ఎందుకని అడగలేదు. ఇహ మళ్ళి పురాణం మొదలు పెడుతుందనే భయంచేత.

"ఇదుగో చొక్కమ్మా, నేను రాసు కునేటప్పుడు పలకరించవాకు. ఇబ్బందవు తుంది నాకు. తెలిసిందా" అన్నాను కావాలనే కాస్త కటువుగా.

అదీ తప్పే అయి కూచుంది.

"కాస్త మాటాడే పనుంది సామి నీతో... ఏటంటే....."

అరవధాటిలో ప్రారంభించింది.

పెన్ను క్రింద పెట్టాను. మోచేతిని గడ్డానికి ఆన్చి హాయిగా కూర్చున్నాను. ఏం చెపుతుందో మహాతల్లి చెప్పెయ్యనీ అనుకుంటూ.

"అస్తమానం ఏదో రాసీ రాసీ రాత్తుంటారు గదా. నాకో వుత్తరం రాసి పెట్టండి సామి, అరవంలో"

"నాకు అరవం రాదే? నువ్వు ఇక్కడి దానివేగా? నీకు అరవం రాదా?" అని తప్పించుకో చూశాను.

"నేనేమైనా ఇస్కూలు మొహం చూస్తినా? రాయటం వత్తాదా నాకు? ఇంతో అంతో సదువుతానంతే. ఫర్లేదు. మీ కన్నడంలోనే రాయండి. ఆడికి కన్నడం వచ్చు."

"ఎవరికి?"

కొంగుతో మొహం కప్పుకొంటూ అదో మాదిరిగా నవ్వింది. సిగ్గుపడుతోంది పాపం!

"మొగుడా? మెడలో తాళిబొట్టు లేదే?''

అడగటానికి సంకోచం నాకు.

"పెళ్లయిందా చొక్కమ్మా నీకు."

"చేసుక్కుంటాడు సామి ముందువోడు" అంది తలొంచుకొని, సిగ్గుతో మొహం దాచుకుంది.

ఎవరైతేనేం, పాపం! తను మాత్రం మనిషి కాదా? బీదదైతేనేం, అందరిలాగా జీవితంలో ఆశ— ఆ కాంక్ష, నవ్వు, ప్రణయం వుండకూడదా? చొక్కమ్మ వయసులో వున్నదే మరి.

చొక్కమ్మకు రాయటం రాదు. దూరాపు వూళ్లోవున్న తన ప్రియునికి తన మనసు లోని ప్రేమ అందించటం ఎలా? పాపం తోకలేని కుక్క పరిస్థితి.

నిజమే, బాగుంది కాని.... అందుకని నేను రాస్తూ కూచోవాలా ఆమె ప్రణయ పత్రాలను??

ఏం? ఎందుకు రాయకూడదు? తప్పేమిటందులో ఇవ్వాళ కాకపోతే రేపు పెళ్లి చేసుకుంటుంది. కాబోయె భర్తకు వుత్తరాలు రాస్తే అందులో అవినీతి ఏముంది? చొక్కమ్మ దారి తప్పిన ఆడదా?

వేలకొలది పేజీలు రాసిన చెయ్యినాది. పెన్ను చేతిలోకి తీసుకొన్నాను.

"ఊఁ, చెప్పు చొక్కమ్మా, ఏంరాయాలి?'

"ఐ, భలె సామి.. మీకు సెప్పాలా నేను? ఎప్పుడూ ఏ ఆడది మీకు రాయలేదూ పేమ లేకలు?"

చూశారా ఎలావుందో చొక్కమ్మ ప్రశ్న. ఇహ దీని కేం జవాబు చెప్పగలను?.

"అది కాదు. విషయం ఏమిటి అని అడిగానంతే. డబ్బు గిబ్బు పంపించమని రాయాలా?"

"చత్. వాడి డబ్బు ముడతానా నేను? బగమంతుడు ఎందుకు నాకు సత్తువ ఇచ్చాడు 'సన్జేసి బతుకు' అని కాదా?"

"అయితే ఒక్కసారి వచ్చి వెళ్లమని రాయ మంటావా?"

"ఆ మాట నేను సెప్పాలా ఆడికి? మనసులో ప్రీతివుంటె ఆడే వస్తాడు. అలా ఏడ్చే ఆడదికాదు సామి నేను"

"భలె" అని మనసులోనే మెచ్చు కొన్నాను. ఏమో అనుకొన్న ఈ చొక్కమ్మకు ఎంత స్వాభిమానం!

"రాసి వుంచండి సామి మళ్లి వస్తాను. మీకు తెలిదూ పేమ లేకలు ఎట్టా రాయాలో? ఎన్ని సదివారో, ఎన్నిరాశారో"

ఇలా అనేసి వెళ్లిపోయింది, గడుసుది చొక్కమ్మ.

మరో రెండు గంటలు పొయ్యాక చేతిలో వో కవరు పట్టుకొని రానే వచ్చింది.

"అడ్రేసు రాయి సామి, సెప్తున్నా"

ఆమె కాబోయె భర్త ఆర్ముగం అడ్రసు రాశాను. నేను రాసిన వుత్తరాన్ని వో సారి అటూ ఇటూ తిప్పి చూసింది. ఆమె కేం అర్థమవుతుంది?

ఐనా తృప్తిగా తల వూపి కవరులో పెట్టింది.

ఆమె మొహంలో సంతృప్తి వెల్లి విరిసింది. ఆనందంతో గెంతుతూ బయ టికి వెళ్లబోయింది. కాని అప్పుడూ మరవ లేదు.

"టీ కాపి తెస్తునా సామి?" అంది.

"ఏమి వద్దు తల్లి. భోజనానికి వెడు తున్నా. నువ్వా కవరు పోస్టులో వెయ్యి."

"వెయ్యక ఇంట్లోపెట్టి పూజసేస్తా నేంటి సామి, రేపే అందుకోదూ వుత్తరం?'

కళ్లలో కాంతి, పెదవుల మీద కొంటె నవ్వు, లేడిలా పరిగెత్తింది చొక్కమ్మ

వారాలు గడిచాయి.

వో సాయంత్రం ఎప్పటిలాగా గది తుడిచాక బల్లమీద దుమ్ము గుడ్డతో తుడుస్తూ మెల్లిగా అడిగింది.

"ఇవాళ తీరికుందా సామీ నీకు?"

"ఏం? ఏం కావాలి?"

"మరేంలేదు. ఇంకో ఉత్తరం రాసి పెట్టాలి....." చిన్నగా నవ్వుతూ తల వంచు కుంది చొక్కమ్మ. ఆడజన్మ, పాపం.

అప్పుడు వ్రాసిన వుత్తరానికి జవాబు వచ్చిందా? ఏమని అడగటం?

"అలాగే రాసి వుంచుతాలె."

"అందులో రాయి సామి. నీ వుత్తరం అందింది, బానే వున్నాను అని" అంటూ వో కవరు బల్లమీదపెట్టి వెళ్లబోయింది.

"చొక్కమ్మా"

"ఏం సామీ" తలుపు దగ్గర ఆగి అంది.

నా మనసు కాస్త కొంటెగా కదిలింది, "నాకు చూపించలేదేం నీ మొగుడి ఉత్త రాన్ని" అన్నా.

నవ్వుతూ క్రిందకు దిగి పోయింది.

మేడ మీద నా గది.

ఏమైనా గుమాస్తా పని తప్పలేదు నాకు. అక్కడ ఆఫీసులో గుమాస్తా, సాహిత్యంలో సరస్వతి గుమాస్తా, ఇప్పుడు చొక్కమ్మ గుమాస్తా!

తప్పేముంది? ఇది అలవాటయింది. ఎనిమిదో పదో ప్రణయ పత్రాలు రాశాను, చొక్కమ్మ కోసం ఆర్ముగానికి.

కాని భలె కిలాడి చొక్కమ్మ. వాడు రాసిన ఒక్క ఉత్తరమైనా నాకు చూపించ లేదు. దానివల్ల నాకేం నష్టం లేదను కోండి.

రోజులాగె బీచ్‌కు వెళ్లి ఆలస్యంగా తిరిగి వచ్చాను. నాగది కిటికీలో నుండి వెలుతురు దూరానికి కనిపించాల్సింది. ఇవాళ కనిపించటం లేదు.

మేడ మెట్ల దగ్గరేవో చిన్న గది. అదే చొక్కమ్మ బంగళా. మూడు రూపాయలి స్తార దానికి అద్దె.

నేను వెళ్లేసరికి జనం గుంపుగా చేరారు అక్కడ. పోలీసులూ వున్నారు.

"ఏమిటీ? ఏమిటిది? ఏం జరిగింది? అందరూ అడిగే వారే.

చొక్కమ్మ ఉరి పోసుకుంది.

పనికి రాలేదేమని పిలవడానికి వచ్చారట్ట అవతలి ఇంటివారు. అప్పటికే చొక్కమ్మ శవం దూలానికి వేలాడుతోంది. వెంటనే పోలీసులకు కబురు పంపించారు.

రోజులు దొర్లిపోయాయి.

ఇన్స్‌పెక్టర్ సుబ్రమణ్యం పాత స్నేహి తులు నాకు. ఏదో మాటల్లో చెప్పారు.

"మీ సర్వెంటు ముండ పిచ్చిదను కొంటానండి. బుద్ధి సరిగ్గా వున్నట్టు లేదు."

ఛ! చొక్కమ్మ పిచ్చిదా? నాన్సెన్స్.

చొక్కమ్మ గురించి అంత తేలిగ్గా మాట్లాడడం నచ్చలేదు నాకు.

"జీవితంలో ఆమెకేం బాధలుండేవో పాపం!"

సుబ్రమణ్యం ప్రారంభించారు.

"నేనంతా కనిపెట్టాను సార్. చాలా ఇంటరెస్టింగ్ కేస్ ఇది. వినండి" అంటూ దగ్గరగా వచ్చారు.

"సేలం దగ్గర సేతుపట్టి అని వో వూరు వుంది. అక్కడో టైలర్ వున్నాడు.

ఆర్ముగం అని వాడి పేరు."

ఆర్ముగం పేరు నాకు తెలియనిదా? పెదవులు బిగబట్టి మౌనంగా విన సాగాను.



ఆ ఆర్ముగం ఈ చొక్కమ్మా ఒకే వీధిలో చిన్నప్పటినుంచి ఆడుకున్న పిల్లలు సార్. ఇద్దరూ చిన్న పిల్లలుగా వున్నప్పుడే పెద్దవాళ్లు వీళ్ల పెళ్లి నిశ్చయం చేశారట. పెళ్లయిందనే అనుకునేవారట అందరూ. ఈ ముండా అలాగే అనుకుందో ఏమిటో....."

"సుబ్రహ్మణ్యం?"

"ఏమిటి సార్" సుబ్రహ్మణ్యం ఆశ్చర్యంగా నా వేపు చూశారు.

"చూడండి, ఇంకోసారి ఆమెను ముండా, మోపి అనకండి, నా ఎదుట ఆమెను గురించి."

"బాగుంది, చెబుతున్నది వినరేం మీరు? అది నిజంగా పిచ్చిది సార్..... పూర్తిగా వినండి ముందు."

నా మనసులోని బాధ, అనుకంపని ఆయనకెలా తెలుస్తుంది!

"పెళ్లి వెలరోజులుండగా ఎవడో డబ్బున్నవాడు పిల్లనిస్తా నన్నాడట. సరే దీన్నిలా వదిలేసి మరోదాన్ని చేసుకొన్నాడు వాడు."

"ఆ! ఆర్ముగానికి పెళ్లయిందా? ఎప్పుడు?"

"ఆరేళ్లయింది సార్ ఇదంతా జరిగి. వాడికిప్పుడు ముగ్గురు పిల్లలు. మళ్లీ కడుపుతో వుంది ఆ భార్య. అదలా వుండ నీయండి. వాళ్ల పెళ్లిరోజే ఈ చొక్కమ్మ వూరు వదలి పారిపోయి వచ్చేసింది ఎవరికీ చెప్పకుండా. చచ్చిపోయిందనే అనుకున్నారట అందరూ. మళ్లీ వాడి మొహం చూడలేదు అది. ఇంతా అయిందా, ఇప్పుడు చెప్పండి దానికి పిచ్చవునో కాదో? వాడికేమో ఎవి మిదో, వదో "లవ్ లెటర్స్" రాయిం చింది. అందులో కన్నడంతో! రాసిన వాళ్లెంతటి వెధవయ్యుండాలి? చూడండి ఆ వుత్తరాలన్నీ దొరికాయి నాకు."

"ఆర్ముగం దగ్గర దొరికాయా?"

"కాదు సార్! జాగ్రత్తగా దాచి వుంచింది. తన ఇంట్లోనే ఓ కుండలో. పోస్టులో వెయ్యనే లేదు. ఏం సైకాలజీ అనాలి దీనికి. ఆ ముండ పిచ్చిది కాకపోతే మరేమి టంటారు? మీరే చెప్పండి సార్."

నన్నెవరో సూదులతో గుచ్చుతున్నట్లని పించింది. ఆ దీనురాలి మొహం నా కళ్ల ముందు మెదిలింది.

మెల్లిగా అటు తిరిగి కళ్లు తుడుచు కున్నాను.

తీరికే కన్పించని ప్రతి ఉదయము
కల్గే మానసిక సంక్షోభాన్ని
తొలగించుకోండి





# ప్రెస్టీజ్‌తో నిమిషాలమీద వంట చేయండి

పొద్దుటే... ఇంట్లో అందరిని కనిపెట్టుకుంటూ వరటవరకి పెట్టాలి. మతి చలింపచేయడానికిదిచాలు. అందుకే ప్రెస్టీజ్ ప్రెషర్ కుక్కరుతో సునాయాసంగా నిమిషాలమీద వంట తయారుచేయవచ్చు.

శీఘ్రత, భద్రత, సౌలభ్యాలతో అతి త్వరగా ఒకే సమయంగా వంట చేయడానికి అవసరమయ్యే పరిపూర్ణమైన అన్నీ ప్రెస్టీజిలోనూ వుంటుంది. కాలము, డబ్బు, ఇంధనపు ఖర్చుకూడా సుమారు సగం వంతుకు తగ్గిస్తుంది. అంతేగాక భద్రతతో సౌలభ్యతతో కూడినది. 12 ఏళ్ల వయస్సు పిల్లలుకూడా దీనిని ఉపయోగించవచ్చు. ఈనాడు 400,000 గృహిణులు సగర్వంగా ప్రెస్టీజ్ సదుపాయాలను అనుభవిస్తున్నారు-నేడే ఒకటి కొనండి.

ప్రెస్టీజ్ మూడు రకాలలో వచ్చునది తీసుకోండి.




**Prestige**

ప్రెస్టీజ్-జీవితాంతం
ఉపయోగపడే
ప్రెషర్ కుక్కర్

తయారుచేయువారు. టి. టి. (ప్రైవేట్) లిమిటెడ్ ప్రెస్టీజ్ గ్రూప్ లిమిటెడ్ ఇండియా వారి లైసెన్సుతో

వైజ్ఞానిక గాథావళి-79



ఫీచర్

# విజ్ఞానంలో జాతివైషమ్యాలు

వైషమ్యాలా? అని అడుగుతారు గాబోలు పాఠకులు. 'జాత్యభిమానాలు' అని వ్రాసినా అదే అర్థముగానీ, తాత్పర్యము కొంచెం మారుతుంది. 'జాత్యభిమానాలు సహజము కదా, మరి ఈ నాటి పరిస్థితి రాజకీయ పరిస్థితులలో అవసరము కూడా కదా' అని అందరూ అంటారు; నిజమే. అయితే సత్యాన్వేషణలో అసత్య ప్రచారము అన్యాయము కాదా? భగవంతుడి సృష్టిలో తెలివి తేటలూ, ఉద్యోగపటూ అన్నవి అందరికీ ఉంటాయి. అన్నీ ఏ ఒక్కరికో మట్టుకు ఉంటాయనరాదు కదా? మన వాటితో కొందరు వేదాల్లో సర్వమూ ఉన్నాయీ తెలివి తేటలు ఆర్యావర్తములో ఆవిర్భవించి ఏ కొద్దో విదేశాలకి తప్పించుకు పోయాయి అన్న రీతిగా కబుర్లు చెప్తారు. ఇది జాత్యభిమానము వల్ల ప్రవేశించిన అసత్యము. రష్యను వైజ్ఞానిక వాఙ్మయము నేడు ధారాళముగా వస్తోంది. దానితో — ఇదివరకటి ఇంగ్లీషు వైజ్ఞానిక గ్రంథాలు స్పృశించని రష్యను వైజ్ఞానికుల కృషిని విశదంగా ఇస్తున్నారు. విజ్ఞానము ఒక్క జాతి వారి సొమ్ము కాదుగదా? ఈ గ్రంథాలు చదివినప్పుడు రష్యనుల కృషి తెలుస్తుంది సరే, చిత్ర మేమిటంటే, కొన్ని పుస్తకాలు రష్యనుల కృషిని మాత్రమే చెప్తాయి, కాని వాటిది ఆ దృష్టి అయినట్టు చెప్పవు! అవి చదివితే — ఇదివరకు రష్యనులు సమర్థులుకారన్న ఏకదేశ నిరసన మన మనస్సులలో లేకపోయినా ఇప్పుడు — రష్యనులే ఈ విజ్ఞాన మంతటినీ పెంచారన్న అభిప్రాయము కలుగుతుంది. వాస్తవానికి ఈ రెండు అభిప్రాయాలూ నిజము కాదు. నిజము వాటికి మధ్యన వుంది.

ఇంగ్లీషు వారి పుస్తకాలలో మరో రీతి జాత్యభిమానము కనబడుతుంది. యురేనస్ అన్న గ్రహము యొక్క గమనము, గణితము చేసి తెలుసుకున్న దీర్ఘ వృత్తములోనే ఉండక, కొంచెము కొంచెము అడుగుతప్పి వున్నట్టుగా అవలోకనాలవల్ల తెలిసింది. దానికి కారణమేమిటో అని ఆంగ్లేయుడు ఏడమ్సూ ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు లెవ్రియరుగా ఎవరికి వారు యత్నించారు. లెవ్రియరు ప్రకటన ముందు జరిగింది అతని పరిశోధన వల్ల కొత్త గ్రహము నెప్ట్యూన్ దొరికింది. ఏడమ్సు లెక్కలు రాయల్ నక్షత్ర సిద్ధాంతికి చేరడమూ, ఆయన వాటిని లెక్కపెట్టక పోడమూ, ఏడమ్సు అలాగ పూనుకోడమూ జరిగియే వుండవచ్చు. అయితే నెప్ట్యూన్ ఉనికి మొదట ఎవరి వల్ల తెలిసింది ప్రపంచానికి? లెవ్రియరు వల్ల. ఇంగ్లీషు పుస్తకాలు ముందు ఏడమ్సును చెప్తాయి, అద్భుతాలు పశ్చాత్తు లెవ్రియరు ముందు వచ్చినట్టుగా వ్రాస్తాయి..... రాంజను X— కిరణాల్ని [illegible]. ఇంగ్లీషు వారి పుస్తకాలు రాంజను తప్పి జారి X— కిరణాల్ని చూసినట్టు వ్రాస్తాయి. కంటికి అందే కిరణాల్ని తప్పించేయడానికి విద్యుత్తును నొక్కినంతే గాజు గొట్టానికి నల్ల కాగితము అంటించాడూ, కంటికి కానరాని కిరణాల్ని చూపించే తెరను సమీపంలో పెట్టాడు రాంజను. ఇంకెవరేనా మరేమి చేశారా?

మ్యూనిచ్‌లో భౌతికవాద వైజ్ఞానిక సంస్థను స్థాపించి, సోమర్‌ఫెల్డు దానికి ప్రయోగశాలను కూడా చేర్చినాడట. ఆంగ్లేయ వైజ్ఞానికులు 'హాని విజ్ఞానము ప్రయోగ పరిశోధన ఏమి చేస్తారోనోయ్' అని హేళన చేశారట. చిత్ర మేమిటంటే, X— కిరణాలు కణ వర్షముగా' అని తీర్మానించిన ఆంగ్ల వైజ్ఞానికులకు వ్యతిరేకముగా ఆ సంస్థలోని అవే పండితుడు ''X— కిరణాలు వెల్తురూ వేడిమీ వలె తరంగములే'' అని నిరూపించాడూ, ఆ సంస్థ పరిశోధనశాలలో రాంజను శిష్యులు ప్రయోగ సాక్ష్యము సమకూర్చారు!

న్యూటను వైజ్ఞానికుడు వెల్తురుగుణాల్ని— బుజారేఖలో ప్రయాణించడమూ, పరావర్తనము (reflect) అయి పతన (incident) మైన కోణము పరావర్తనమైన కోణముతో సమమయేటట్టుగా తూలడమూ— గుర్తించి 'వెల్తురు సూక్ష్మాతి సూక్ష్మ కణ వర్షము' అని తీర్మానించాడు. ఇంకో అడుగు ముందుకు వేసి, వెల్తురు వేగము వాయువూ శూన్యములలో కన్న ఘన పదార్థాలలో ఎక్కువ అన్నాడు. ఈ చివర తీర్మానము ఫొకాల్టు ప్రయోగముతో భంగమైంది. వైజ్ఞానిక పరిశోధనలలో ఇది మామూలే. అయితే నాటికి నేడు ప్లాంకు యొక్క క్వాంటం వాదాన్ని ఉపయోగించి అయిన్‌స్టీను, 'వెల్తురు కణరూపం గానే పెల్చబడుతుంది' అని నిరూపించడముతో ఆ క్వాంటం వాదాన్ని — అది జర్మను వైజ్ఞానికుడిది — గురించి చెప్పేటప్పుడు ఇంగ్లీషు వారు ''మూడు వందలేండ్లకు ముందే న్యూటను సూచించాడు'' అంటూ గొప్పలు చెప్పుకుంటారు.

అయిన్‌స్టీను, న్యూటను గురుత్వాకర్షణ వాదాన్ని తోసిరాజని కాలాంతరాళ వక్రతని ప్రతిపాదించాడు. దాన్ని కాదనడానికి సాక్ష్య సేకరణ చేస్తున్నారు హాయిల్ వంటి ఆంగ్ల వైజ్ఞానికులు. ఒక ప్రయోగముతో, బుధగ్రహము కక్ష్య యొక్క తిరుగుడు సరిగ్గా అయిన్‌స్టీను చెప్పినంతే వస్తే ''ఆ ఏదైనా అంత సరిగ్గా సరిపోతుందా ఏమిటి'' అన్నారుట ఆంగ్ల వైజ్ఞానికులు! అందుకే అప్పుడట అయిన్‌స్టీను 'నా వాదము రైటయితే ఫ్రెంచి వారు నన్ను యూదుడంటారా, జర్మన్ వారు నన్ను జర్మన్ దేశీయుడంటారు నా వాదము తప్పయిపోతే ఫ్రెంచివారు నన్ను జర్మను వాడంటారా, జర్మనులు యూదుడంటారా'' అని. మొసలే అనే ఆంగ్ల వైజ్ఞానికుడు 1914—18 యుద్ధంలో చచ్చిపోయాడు. ఆంగ్ల వైజ్ఞానిక గ్రంథాలలో 'మోసలే గల్లిపోలీలో టర్కీ తుపాకీ గుండుదెబ్బ చచ్చిపోయాడు' అని వ్రాస్తారు. అంతటి వైజ్ఞానికుణ్ణి భుజాన్ని తుపాకీ వేసి వెళ్లనివ్వడము విపరీతమనిపిస్తుంది పై వాళ్లకి. వారికి మట్టుకు టర్కీషు గుండు చంపడము విపరీతము!

మేఘనాధ్ సాహాగారి నక్షత్ర వాతావరణ ఆయనీకరణ వాదము ఫౌలరు అవునన్న తర్వాతే ఆయనను (ఆయనవెంట) ఈయనను F.R.S. చేశారు. రామన్ మహాశయులు భారతీయులని గనుకనే నోబెలు బహుమానానికి కొన్ని యేండ్లు వేచి యుండినారు. విజ్ఞాన వీధులలో కూడా ప్రచారానికేనా ప్రథమ తాంబూలము?



HIMALAYAN

FINEST GOLDEN DUST TEA

LIPTON'S

FINEST

GOLDEN DUST TEA

LHGC-2 TE

# మేలిరకం "డస్ట్" టీలతో సాటిలేనిది



## లిప్టన్స్
## హిమాలయన్
## గోల్డెన్ డస్ట్ టీ

ఈ టీతో మీరు కమ్మని, చిక్కని బంగారు ఛాయగల టీ కప్పుల వెంబడి కప్పులు అతి త్వరలో తయారుచేయగలుగుదురు. ఈ పానీయమును మీరే త్రాగి చూడండి. మీ అతిథులకుకూడా యివ్వండి. మీరు తప్పక సంతోషముతో సేవిస్తారు. అవును — మీ ఆనందభరితులైన అతిథులుకూడాను. లిప్టన్స్ హిమాలయన్ గోల్డెన్ డస్ట్ టీ మేలిరకం టీలలో నిజంగా అద్వితీయమైనది.




లిప్టన్స్
అంటే
మంచి టీ

# కమ్యూనిస్టు దేశాలలో కాంగ్రెస్ అధ్యక్షుడు కామరాజ్

## ఆర్. వెంకట్రామన్

**మద్రాసు పరిశ్రమలమంత్రి**

**(గత సంచిక తరువాయి)**

శ్రీ కామరాజ్ సోషలిస్టు దేశ పర్యటన గురించి వ్రాయడానికి ముందు సోవియట్ భూమిని గురించి, దాని రాజకీయాలను గురించి, పరిపాలన పద్ధతిని గురించి ఒక విధంగా వివరించడం అవసరమని నాకు తోస్తున్నది.

ప్రస్తుత ప్రపంచపు ముఖ్యమైన అగ్రరాజ్యాలలో ఒక్కటిగా విరాజిల్లే సోవియట్ రష్యాను గురించి పెక్కు రకాల వార్తలు, అభిప్రాయాలు ప్రచారమవుతున్నాయి. ఇనుపతెర వెనుకవుండే దేశమనే పేరుకూడ ఒక సమయంలో దానికి వుండేది.

అయితే ఇప్పటి స్థితి ఏమిటి?

ప్రపంచ విస్తీర్ణంలో ఆరింట ఒక భాగం సోవియట్ యూనియన్‌ది. సోవియట్ భూమి పదిహేను రిపబ్లిక్కుల చేరిన ఒక సమష్టి పరిపాలన వ్యవస్థ. దానిని మూడు భాగాలుగా విభజించవచ్చు. యూరోపియన్ రిపబ్లిక్కుల భాగం ఒకటి, మధ్య ఆసియా రిపబ్లిక్కుల భాగం రెండవది, కాకేషియసుకు ఆవలవున్న భాగం మూడవది.

యూరోపియన్ భాగంలో ఏడు రిపబ్లిక్కులు వున్నాయి. రష్యా, బెలోరష్యా, ఉక్రేనియన్, ఎస్తోనియన్, లట్వియా, లిథువేనియా, మాల్డేవియన్.

మధ్య ఆసియా భాగంలో టర్క్‌మన్, తాజిక్, కొసాక్, కిర్‌గిజ్, ఉజ్‌బెక్, రిపబ్లిక్కు లున్నాయి.

కాకేషియన్ భాగంలో జార్జియన్, అజర్‌బైజాన్, ఆర్మీనియా రిపబ్లిక్కులు వున్నాయి.

ఈ విస్తారమైన దేశం జనాభా 22.8 కోట్లు. చైనా, భారతదేశాల తర్వాత జన సంఖ్యలో మూడవ పెద్ద దేశం సోవియట్ రష్యాయే. సోవియట్ భూమిలో మూడింట ఒకవంతు యూరోప్ ఖండంలోను, తక్కిన రెండు వంతులు ఆసియాఖండంలోను వున్నాయి.

పాఠశాల పాఠ్యపుస్తకాలలో చెప్ప దగినట్టి కొన్ని భూగోళ విషయాల వివరాలను నేనిక్కడ చెప్పడానికి కారణా లున్నాయి. ఈ వివరాలను మనసులో పెట్టుకొని చూస్తేనే, ఇప్పటి రాజకీయ ప్రపంచంలో రష్యా స్థితిని స్పష్టంగా తెలుసుకోడం సాధ్యమవుతుంది.

యూరోప్ ఖండంలోను, ఆసియా ఖండంలోను సోవియట్ రిపబ్లిక్ వుండడం వల్లనే, ఆఫ్రో-ఏషియా మహాసభలలోను, ఆసియా దేశాల వ్యవహారాలలోను తన కొక ముఖ్యమైన భాగం, బాధ్యత వున్నవని సోవియట్ యూనియన్ వాదిస్తున్నది. భూగోళపు భూమికతో చూస్తే అది వాదించడం సహజమని కూడా మనకు అర్థమవుతుంది. కాని, చైనావారు సోవియట్ యూనియనును యూరోప్ దేశమని, ఆసియా, ఆఫ్రికా వ్యవహారాలలో అది స్థానం పొందడంగాని, జోక్యం చేసుకోడం గాని కూడదని ప్రతిఘటిస్తున్నారు. రెండవ ఆఫ్రో-ఏషియా మహాసభకు సంబంధించిన ఏర్పాట్లను గురించి చర్చించడానికి సమావేశం జరిగినప్పుడు, సోవియట్ యూనియన్ ఆ మహాసభలో పాల్గొనరాదని, దానిని యూరోపియన్ దేశంగానే పరిగణించాలని చైనా, పాకిస్థాన్, ఇండోనేషియా — ఈ మూడు దేశాలూ నొక్కినొక్కి చెప్పాయి. అయితే, సోవియట్ యూనియనుకు ఆసియా, ఆఫ్రికా వ్యవహారాలలో పూర్తిగా హక్కు వుందనేదే భారతదేశం వాదం. ఈ వాదానికి బలం ఎక్కువకాగా, దానిని సంబాళించడం చేతకాక, ఆఫ్రో-ఏషియా మహాసభనే కాల పరిమితి లేకుండ వాయిదా వేయించింది చైనా.

ఈ విధంగా ఈ ఆసియా వ్యవహారంలోను చైనాకు, సోవియట్ యూనియనుకు మధ్య అభిప్రాయ భేదాలు ఎక్కువ కావడం చూస్తున్నాము.

ప్రపంచంలోని దేశాలు వేర్వేరు ఆర్థిక రాజకీయ విధానాలను అనుసరిస్తున్నప్పటికీ, సౌహార్దంతో శాంతియుత సహజీవనం చేయడ సాధ్యం, ఆ విధంగా సహజీవనం చేయాలి అనేది సోవియట్



క్రెమ్లిన్ భవనంలో శ్రీ కామరాజ్

[illegible] విధానం. దీనితోను చైనా రష్యాతో విభేదిస్తున్నది. అమెరికా వంటి పెట్టుబడిదార్ల వ్యవస్థవున్న దేశాలతో శాంతి యుత సహ జీవనం సాధ్యమని చెప్పడం మూలంగానే రష్యా విప్లవ విరోధి అని చైనా విమర్శిస్తున్నది. మూల విధానాలలో కనిపించే ఈ విభేదం క్రమంగా ముదిరి పెరుగుతున్నది.

భారతదేశ వైదేశిక విధానం కాంగ్రెస్ మహాసభ తీర్మానాల మూలంగాను, మాజీ ప్రధాని శ్రీ నెహ్రూ ప్రకటనల మూలంగాను వివరించ బడివున్నది. వేరు రాజకీయ విధానం గల అన్యదేశాలతోను శాంతి యుతంగా సహజీవనం సాగించవచ్చునని, ప్రపంచ సహజీవన సిద్ధాంతమే శ్రేష్ఠమైనదని, దానిని అనుసరించడం ఒక్కటే శ్రేష్ఠమైన మార్గమని ఆ తీర్మానాలు, ప్రకటనలు స్పష్ట పరిచాయి. ఈ విధంగా సోవియట్ యూనియన్, భారత దేశాల మధ్య భావనమైక్యమూ, చైనాకు— సోవియట్ భారతదేశాలకు మధ్యన విధానంలో భేదాభిప్రాయమూ వ్యాపించి వస్తున్నాయి.

ఆ శాంతియుత సహజీవన విధానం ప్రతినిధిగా నెహ్రూ నడచిన మార్గంలో నడిచే నాయకులుగానే కామరాజ్ రష్యా భూమిపై అడుగు పెట్టారు.

"భారత వైదేశిక విధానంలో ఎలాటి మార్పూ లేదు. నిబంధ విధానం, శాంతి యుత సహజీవనం ఇవే మా లక్ష్యం" అనే సోవియట్ దేశాలలో వెళ్ళిన ప్రతి చోట నొక్కి చెప్పారు మన నాయకులు కామరాజ్.

కామరాజ్ పర్యటనలో ఆయనతో పాటు ఆయన అంతరంగ కార్యదర్శిగా కాంగ్రెస్ పార్టీ శాశ్వత కార్యదర్శి శ్రీ వటన్‌కీ, నేను వెళ్ళాము. సోవియట్ దేశంలో ఎక్కడబడితే అక్కడికి వెళ్ళ వచ్చుననే ఉద్దేశంతో మాకోసం– ఒక విమానమే ప్రత్యేకించ బడింది అని మాకు స్వాగతం చెప్పిన స్పిరిదినోవ్ తెలిపారు.

మాతోపాటు రష్యా పత్రికా ప్రతినిధులు గూడ పలువురు వచ్చారు. భారత దేశ పత్రికల విలేఖరులు గూడ మా బృందంలో వున్నారు. హిందూపత్రిక విలేకరి శ్రీ కె. రంగస్వామి, పి.టి.ఐ. విలేకరి శ్రీ వటన్. ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ప్రతినిధి శ్రీ దేవ్ మురార్కా, అమృత బజార్ పత్రిక ప్రతినిధి శ్రీ సర్కార్ వంటివారు మాతోపాటు వచ్చారు.

విమానాశ్రయంలో శ్రీ స్పిరిదినోవ్ మాకు స్వాగతం చెప్పినప్పుడు కూడా సంప్రదాయం ప్రకారం కామరాజ్ వున్న చోటికి వెళ్ళి వారితో కరస్పర్శ చేసి సంభాషించారు.

శ్రీ స్పిరిదినోవ్ కామరాజును చూచి, "మీ మాస్కోరాక మాకు సంతోషం కలిగిస్తున్నది. సోవియట్ దేశానికి, భారత దేశానికి మధ్య చాలకాలంగా సాంస్కృతిక సంబంధం వుంది. కొన్ని రోజుల క్రితం మీ ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి మా దేశానికి విచ్చేశారు. దాని వలన మన సంబంధాలు బలపడినవి. ఇప్పుడు మీరు విజయం చేయడంవల్ల అవి మరింత దృఢమవు తున్నాయి." అన్నారు.

కామరాజ్ పర్యటన కోసం నిర్ణయించిన రోజులు కొన్నేనని, ఆ కొద్దికాల వ్యవధి సోవియట్ దేశాన్నంతా చూడడానికి చాలదని విచార పడ్డారు శ్రీ స్పిరిదినోవ్.

ఆయన స్వాగతానికి కృతజ్ఞత తెలిపిన కామరాజ్ తమకు ఈ అభినందనలు లభించడం వల్ల విశేషంగా సంతోషం పొందామని అన్నారు.

"భారత దేశానికీ, సోవియట్ రష్యాకూ పెక్కు సామ్యాలు వున్నవి. ఈ పర్యటనలో సోవియట్ దేశ ప్రజల పరిస్థితి, వారి అభిలాషలు, వారి పురోగతి— వీటినే నేను చూడడానికి ఆశిస్తున్నాను. సాధ్యమైనంతవరకు వాటిని ప్రయోజనకరం చేసుకోడానికికూడ వాంఛిస్తున్నాను" అన్నారు కామరాజ్.

"మీకు ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళి చూడండి. మా కార్యక్రమంలో వున్న స్థలాలు కాక మరే స్థలాలైనా చూడ దలచుకున్నా తెలుపండి. నిరాఘాటంగా అక్కడికి పిలుచుకొని వెళ్ళతాము" అన్నారు స్పిరిదినోవ్.

ప్రేమ పూర్వమైన ఈ స్వాగతం ప్రశంసనీయమైన ఒక సంగతి. ఒకానొకప్పుడు ఇనుపతెర వెనుక ఏమి జరుగుతున్నదో ఎవరూ తెలుసుకో జాలరని అన్నారు. నేడు "ఎక్కడ ఇష్టపడితే అక్కడ మీరు పోయి చూడండి" అని మన నాయకులు కామరాజ్‌కు స్వాగతం చెబుతున్నారు.

ఇది మహత్తరమైన మార్పు కదా?

లెనిన్ పర్వతంపై వున్న మా దాచా (అతిథులున్న ఇంటిని రష్యాలో దాచా అంటారు.) చాల రమ్యమైన వాతావరణంలో నిర్మింపబడింది. గుబురైన తోట మధ్యన అందమైన దృశ్యమిస్తుంది ఆ మేడ. ఎటు చూచినా, పచ్చని దృశ్యాల పక్కలు పరచినట్లున్న కనులు చెదరిపోయే రంగు రంగు పూవుల తోటల వరుసలు, హృదయాన్ని చల్లబరచే వాతావరణం, అభివృద్ధి చెందిన దేశం భాగం ఎట్లు ఉంటుందనడానికి తార్కాణ మిది. ఆ మేడ లోపల గూడ అతిథులకు కావలసిన సకల వస్తువులూ అక్కడక్కడే తయారయి కాచుకొని వుండినవి.

ముందుగా నిర్ణయించిన పర్యటన కార్యక్రమం ప్రకారం కామరాజ్ కలుసుకున్న మొదటివారు మాస్కోనగరం మేయర్. కార్పొరేషన్ కార్యాలయానికి వెళ్ళి ఆయనను కలుసుకున్నాము.

కామరాజ్, మాస్కోనగర మేయరు వివిధ సమస్యలను గురించి సంభాషించారు.



మాస్కో విశ్వవిద్యాలయం

# కామరాజ్

దానిని తెలుసుకోడానికి ముందు మాస్కో నగరాన్ని గురించి కొంచెం చెప్పడం అవసరమని నేను భావిస్తున్నాను.

మాస్కో—

ఈ పేరు తెలియని వారు ఎవ్వరూ ఈనాడు ప్రపంచంలో ఉండడం సాధ్యంకాదు. ప్రపంచపు చరిత్రలను లిఖితాన్ని నిర్ణయించే రాజధానులలో ఇది కూడా ఒక్కటి!

సోవియట్ దేశానికి రాజధాని అయిన ఈ మాస్కో పురాతన నగరం. ఇంచుమించు 850 సంవత్సరాలకు ముందు స్థాపించబడినది ఈ నగరం. పీటర్ చక్రవర్తి మధ్యకాలంలో తన రాజధానిని సెయింట్ పీటర్స్‌బర్గ్‌కు (ఇప్పటి లెనిన్‌గ్రాడ్‌కు) మార్చాడు. అయితే విప్లవానంతరం మాస్కోయే మళ్ళీ రాజధానిగా గౌరవం పొందింది.

మాస్కో జన సంఖ్య అరవయ్యైదు లక్షలు. సోవియట్ దేశంలో తయారయ్యే యంత్ర భాగాలలో 10 శాతం మాస్కోలో తయారవుతున్నవి.

మాస్కో నగరాభివృద్ధికి ఒక పదిహేను సంవత్సరాల ప్రణాళిక సిద్ధపరిచారు. దానిని గురించి మాస్కోనగర మేయరు కామరాజ్‌కు గొప్పగా చెప్పారు.

"ఈ పదిహేను సంవత్సరాల ప్రణాళిక క్రింద మాస్కో నగరాన్ని అభివృద్ధి చేయనున్నాము. ఇక మాస్కో నగరంలో కొత్త కర్మాగారాలు నెలకొనగూడదు. జనసంఖ్య 67—68 లక్షలను మించరాదని నిర్ణయించుకున్నాము" అన్నారు మేయరు.

"ఇది కొందరికి విచిత్రంగా తోచవచ్చు. అయితే, ఈ కట్టుబాట్లు చాల అవసరమైనవి. ఇలాంటి కట్టుబాట్లేవీ లేనందువల్లనే ఇప్పటి ప్రపంచంలో కొన్ని పెద్ద నగరాలు కష్టాల పాలవుతున్నాయి. టోక్యో, న్యూయార్క్ వంటి నగరాలు జనసంఖ్య ఎక్కువ కావడం వల్లనూ, పరిశ్రమలు విస్తరించడం వల్లనూ చాల అవస్థ పడుతున్నాయి." అని నిర్దేశించి చూపారు మాస్కో మేయరు.

"మాస్కో నగరం జనసంఖ్యను కట్టుబాటు చేయడం మీకు ఎలా సాధ్యం?" అని అందరికీ కలిగే న్యాయమైన సందేహాన్ని అడిగాము.

"మా సోవియట్ దేశంలో ప్రతి పౌరునికీ ఒక పరిచయ పత్రం (ఐడింటిటీ కార్డ్) ఉంటుంది. దానిలో ఆ పౌరుడు ఏ భాగంలో నివసించేవాడనేది గుర్తు వేయబడివుంటుంది. వారు వేరే ప్రాంతాలకు వలసపోదలచుకుంటే అక్కడ వారికి వృత్తి వుండాలి. వృత్తిలేక 'మరొక' నగరానికి వెళ్ళి వారు జీవించడం సాధ్యం కాదు. ఉదాహరణకు... మరొక ప్రాంతంలో నివసించే ఒక పౌరుడు మాస్కోకు వచ్చి జీవనం గడుపదలచుకుంటే, మాస్కోలో వున్న వృత్తిశాలలలోనో, కార్యాలయాలలోనో వానికి పని దొరకాలి. వానికి పని ఇవ్వడానికి ముందుకువచ్చే వారు వచ్చేవారి గృహవసతి సమస్యను మొదట తీర్చాలి. నివసించడానికి గృహవసతి కలిగించిన తర్వాతే ఎవరైనా పని ఇవ్వడానికి అవకాశం వుంది. ఈ సమస్యను పరిష్కరించడానికి ఇలా ఒక విధమైన కట్టుబాటు పెట్టాము" అని సమాధాన మిచ్చారు మేయరు.

ఇలా చేయడంవల్ల రష్యా ప్రజలు మాస్కోకు రావడంపై నిషేధం విధించబడిందని అర్థంకాదు. సోవియట్ ప్రజలు మాస్కోకు ధారాళంగా, నిరాఘాటంగా పోయి రావచ్చు. అయితే అక్కడ నిరంతరం నివసించడానికి ఈ విధంగా కొన్ని కట్టుబాట్లున్నాయి.

"మాస్కో నగరపు చాల ముఖ్యమైన, తీవ్రమైన సమస్య ఏమిటి?" అని ప్రశ్నించారు కామరాజ్.

"గృహ సమస్యే!" అన్నారు మేయరు.

"ప్రతి ఏటా లక్షయాభైవేల ఇళ్ళు కట్టించి, వాటిలో నాలుగున్నర లక్షల జనం నివసించడానికి ఏర్పాటు చేస్తున్నాము. అయినా తీరని లోటే. ఈ లోటు పూర్తి చేయడానికి ఇంకా ఎనిమిది సంవత్సరాలు పడుతుంది." అన్నారు.

"ఇంటి కొక మంటి పొయ్యి" అని మనసులో అనుకున్నాను. చెన్నపురిలో నా ఎదుట నిలిచే మహత్తర సమస్య కూడా, ఈ గృహ వసతి సమస్యే కదా!

"మాస్కోనగర వాసులలో పన్నెండు లక్షల మంది వృద్ధాప్యపు పెన్షన్ పొందుతున్నారు. వారి సరాసరి వయస్సు డెబ్బయి సంవత్సరాలు" అని తెలుసుకున్నప్పుడు, కామరాజ్ విస్తుపోయారు. మద్రాసు రాష్ట్రంలోను వృద్ధాప్యపు పెన్షన్ పద్ధతిని ప్రవేశ పెట్టినవారు ఆయనే.

మాస్కో నగరపు మరొక గొప్పదనం అందమైన భూగర్భపు రైల్వే. నేను ప్రపంచంలోని పెక్కు దేశాలలో భూగర్భపు రైళ్లను చూచాను. అయితే మాస్కో నగరం భూగర్భపు రైళ్లఅందం మరోదానికి లేదని గట్టిగా చెప్పగలను. మాస్కో నగరం పౌరులు మూడింట ఒక వంతు రాకపోకలు ఈ భూగర్భపు రైళ్ల మూలంగానే జరుగుతాయి.

మాస్కో నగర వీధులు గూడ విశాలమైనవే. మూడు వందల అడుగుల వెడల్పయిన వీధులూ వున్నాయి. వాటిని దాటడానికి సొరంగ మార్గాలు. ఆ వీధులలో సంవత్సరం పొడుపునా లక్షల కొలది మోటారు కార్లు తిరుగాడుతాయి. రష్యాలో ఏటా 2,15,000 కార్లు తయారు చేస్తున్నారు.

"ఇక నాలుగు సంవత్సరాలలో ఈ సంఖ్య ఎనిమిది లక్షలకు పెరుగుతుంది. అందువల్ల వీధులను మరింత విస్తారం చేయవలసిన అవసరం ఏర్పడింది." అని కామరాజ్‌తో అన్నారు మాస్కో మేయరు.

"యాత్రికుల కోసమే వసతి కలిగించే 'ఇన్‌ట్యూరిస్ట్' హోటళ్ళు ఒక ప్రక్క పెరిగి పోతున్నాయి. ఏటా పది లక్షల మంది యాత్రికులు మాస్కోకు వచ్చి పోవడం వల్ల ఈ హోటళ్ళ అవసరమవుతున్నాయి." అని కామరాజ్‌కు మేయర్ తెలిపారు. (సశేషం)

—అనువాదం: తి. రా.

(ఆనందవికటన్ సౌజన్యంతో)






స్టోర్‌వెల్ భద్రతకున్ను వస్తువులను క్రమబద్ధంగా 'నిలవ చేయుటకున్ను తగినట్టిది — చోర, అగ్ని నిరోధమునకు ప్రసిద్ధయినది.

ప్రత్యేక పేటెంటెడ్ సుగుణములతోను, అసమానమైన తుప్పు-నిరోధక సంధానముతోను అత్యాధికంగా నిర్మించబడు చున్నట్టి ఈ అద్భుతమైనది, శ్రేష్ఠమైన విలువ అనిపించే ధరకు పొందగును.

# బీరువాలన్నిట్లో ఉత్తమ విలువైనది

# స్టోర్‌వెల్



1981 మి.మీ. ఎత్తు x 914 మి.మీ. వె. x 483 మి.మీ. లోతు
(78" ఎత్తు x 36" వె. x 19" లోతు)

గోద్రెజ్ ప్రదర్శనాగృహము (షో రూమ్) అందు గాని లేక భారతదేశమందంతటా గల స్టాకిస్టులవద్దగాని ప్రదర్శించబడు చున్నట్టి వివిధ స్టోర్‌వెల్ రకములను చూడుడు.



# అనూహ్యం

కొలను వెంకట దుర్గాప్రసాద్



బిట్రగుంట బస్టాండులో టిక్కెట్టు తీసుకొని బెజవాడకు వెళ్లే బస్సు ఎక్కాడు నాగభూషణం. చేతిలోని చిన్న సంచిని ప్రక్కన పెట్టుకున్నాడు. టైము చూసుకున్నాడు. పది అయింది. 'అయితే భోజనం వేళకి బెజవాడ చేరుకోవచ్చు' అనుకున్నాడు.

బస్సు ఇప్పుడప్పుడే కదిలేలా లేదు అనుకుంటూ కిటికీలోంచి బయట జనాన్ని చూస్తూ వుండిపోయాడు.

బస్సు నిండిపోయింది. డ్రైవర్ అప్పుడే తన సీట్లోకి వచ్చి కూర్చున్నాడు.

కొంత దూరంలో ఒకాయన కంగారుగా వెళ్లి బుక్కింగ్ ఆఫీసులో టికట్లు తీసుకున్నాడు. గబగబా నడుచుకుంటూ 'సుధా! త్వరగా రండి. బస్సు కదులుతోంది' అన్నాడు.

'సుధ' అనే పిలుపుకి నాగభూషణం ఉలిక్కిపడ్డాడు. ఆత్రుతగా అతను పిలిచిన వేపుకి చూశాడు.

ఓ పాతికేళ్ల ఆవిడ చంటివాణ్ని ఎత్తుకొని నడుస్తూ బస్సుని సమీపిస్తోంది. ప్రక్కనే ఓ నాలుగేళ్ల కుర్రాడు ఆవిడ చేయి పట్టుకొని నడుస్తున్నాడు.

వాళ్లు బస్సులో ఎక్కారు. ఆయన మాత్రం ఎక్కలేదు. 'సుధా! ఇకనేనుంటా. ఆఁ—?.. వాణ్ని కూడా ఒసారి రమ్మని చెప్పు. బొత్తిగా రావడం మానేశాడు. మరి, నేనుంటా' ఆయన అన్నాడు. సుధ తలూపింది. ఆయన అందించిన సామాను ప్రక్కన పెడుతూ.

సుధని చూశాడు వెనక్కి తిరిగి గభాల్న మొహం తిప్పేసుకున్నాడు. 'ఇప్పుడేం చెయ్యాలి'' తన మొహం సుధకి ఎలా చూపించాలి? సుధ మధ్యలో ఎక్కడన్నా దిగుతుందా లేక బెజవాడ వరకూ వస్తోందా? నయం.. సుధ ఇంకా తనని చూళ్లేదు. చూసిందంటే అసహ్యించుకోదూ?.. చాలా ఇరుకున పడ్డానే.. బస్సు దిగితే బాగుణ్ను.'

బస్సు దిగుదామని నిశ్చయించుకొని లేవబోయాడు. కానీ బస్సు అప్పటికే ఫర్లాంగు దూరం నడిచింది. అది గమనించి ఉస్సురని కూలబడ్డాడు.

బస్సు స్పీడుకి గాలి మొహానికి గట్టిగా తగులుతోంది నాగభూషణానికి.

'సుధని ఇవాళ అనుకోకుండా కలిశాడు తను. సుధ బెజవాడలో దిగి తనని గుర్తుపడితే ఏంచెయ్యాలి? అయిదేళ్ల క్రితం సంగతి. ఇంకా సుధకి గుర్తా? ఏమో మరి? సుధకి గుర్తుందో లేదో కాన్నీ తనకి మాత్రం ఇప్పుడూ గుర్తే.]

ఒక్కసారి జబేళ్ళు వెనక్కి వెళ్ళాడు నాగభూషణం.

సుధా, నాగభూషణం ఒకేసారి డిగ్రీని జీర్ణించుకొని కాలేజీలోంచి బయటపడ్డారు కొందరి లాగే.

సుధకి అమ్మవుంది. అప్పు వుంది కొద్దిగా. తండ్రి చిన్నప్పుడే గతించాడు. ఇంకా సుధ తర్వాత ఇద్దరు ఆడపిల్లలున్నారు. ఇదీ సుధ గురించి నాగభూషణానికి తెల్సిన వివరాలు.

సుధ అందమైనదని కాలేజీలో అంతా ఒప్పుకుంటారు. చదువులో కూడా అందరి కన్నా పైచేయిగా వుండేది. సుధ మిత భాషిణి. దాదాపు మౌనంగా ఉండేది. 'కాలేజీకి చదువుకోడానికి వస్తున్నాం మరో ఉద్దేశంతో రావడంలేదు' అన్నట్టుగా వుండేది.

ఆమె మౌనం మగాళ్ళందరికీ బాధ కలిగించేది. ఒకవేళ ఎవరన్నా మొగాడు మాట్లాడినా పట్టించుకునేది కాదు అంతగా. తోటి ఆడపిల్లలతో పాటు, మొగాళ్ళు కూడా 'మూగమ్మాయి' అని సుధకి పేరు పెట్టారు.

నాగభూషణం సుధకి క్లాసుమేటు కాక పోయినా ఒకే కాలేజీ కావడంవల్ల ఒకరి పేర్లు ఒకరికి తెల్సు. కాలేజి మొత్తంలో సిగ్గరిన (అంటే చక్కగా) మొగాడు ఒక్క నాగభూషణమే. అది అందరికీ తెల్సిన విషయమే. ఆ విధంగానే సుధకి నాగభూషణం పేరు గుర్తు.

ఇక నాగభూషణం సంగతి. అతను సుధ ఆకర్షణకి లోనయ్యాడు ఫైనలియరు చదివే రోజుల్లోనే. ఆమె మీద చెప్ప లేనంతగా అభిమానం పెంచుకున్నాడు.

నాగభూషణం అలా సుధని అభిమా నించడానికి అనేక కారణాలున్నాయి. వాటిల్లో కొన్ని—సుధ పంతొమ్మిదేళ్ళ కదా అని రెండు జడలు వేసుకోదు. చక్కగా వాలు జడ వేసుకొని కొద్దిగాపూలు తల్లో తురుము కునేది. ఆమె ఎప్పుడూ నొసటన తిలకం ధరిస్తుండేది. చేతులకి గాజులు వేస్తుం డేది. అనవసరంగా ఎవరితోనూ మాట్లా డదు. పగలబడి నవ్వదు.

కాలేజి అమ్మాయి లందరికీ ఈ పై లక్ష ణాలు లోపంగానే వుంటాయి. ఈలోపాలు ఒక్కొక్క అమ్మాయిలో కనిపించకపోయినా కాలేజీ మొత్తంలో చూస్తే ఇవన్నీ కని పిస్తాయి నాగభూషణానికి. అందుకే మిగతా వాళ్ళంటే అభిమానించలేక పోయ్యాడు. నాగభూషణానిది మధ్యతరగతి కుటుంబం. (గొప్ప గాకపోయినా) ఆస్తి కరిగిపోయింది. లేకపోతే నాగభూష ణం తప్పకుండా తప్పేవాడే!—డిగ్రీ.

పరీక్షా ఫలితాలు రావటంతో, డిగ్రీ రావటంతో ఇద్దరికీ కాలేజీతో ఋణం తీరి పోయింది.

నాగభూషణం ఉద్యోగం కోసం ప్రయ త్నాలు మొదలుపెట్టాడు.

ఓరోజు ఒక కంపెనీలో ఇంటర్వ్యూకి అని నాగభూషణం బయలుదేరాడు. పెందలాడే తయారయి బస్టాపులో నుంచున్నాడు బస్సు కోసం ఎదురు చూస్తూ. బస్సు రాలేదుగానీ, సుధ వచ్చింది అదే బస్టాప్ దగ్గరికి. నాగభూషణం మెల్లగా సుధ వంక చూశాడు. ఆమె చేతిలో చిన్న టిఫిన్ కారియర్ వుంది. 'ఎక్కడికెళుతుందో?' అనుకున్నాడు నాగభూషణం.

బస్టాప్‌లోని జనం అంతా సుధ వంకే చూస్తున్నారు. చాలా సింపుల్‌గా ఉన్న ఆమె అందాన్ని చూడకుండా ఉండలేకపోతున్నారు.

కానీ నాగభూషణం సుధని మిగతా వాళ్ళ లాగ చూడడానికి భయపడ్డాడు.

'ఏవిటీ మొగాళ్ళు, పాపం సుధ అలా సిగ్గుతో కుంచించుకుపోతుంటే అలా గుచ్చి గుచ్చి చూస్తారెందుకు? ఛీ! ఛీ! బొత్తిగా సంస్కారం తెలియని వాళ్ళు' తిట్టు కున్నాడు నాగభూషణం మిగతా వాళ్ళకేసి చూసి.

బస్సు ఎదురు చూసిన కొలది ఆలస్య మయ్యింది.

'పాపం సుధ నిలబడలేకపోతోంది!' నొచ్చు కున్నాడు నాగభూషణం.

కాసేపటికి బస్సువచ్చి సుధని రక్షించింది. అంతా బస్సుకోసం గుమిగూడారు. సుధ ఆ జనంలో కలిసిపోయింది! అనుకోకుండా నాగభూషణం కూడా సుధ వెనకనే నిల బడ్డాడు. మెల్లగా అందరూ బస్సుఎక్కారు. బస్సు బరువుగా కదిలింది.

ఆమెకి సీటు దొరికింది. బస్సులో సుధ ముందే నిల్చుని ఉండాల్సి వచ్చినందుకు, కొద్దిగా ఇబ్బంది అనుభవించాడు నాగ భూషణం. మరికొంచెం సిగ్గుపడ్డాడు.

ఆమె ఎక్కడికి టిక్కెట్టు అడిగిందో విన్నాడు. కాసేపటికి ఆమె దిగవలసిన చోటు రావడం, ఆమె దిగి వెళ్ళిపోవడం జరిగాయి.

ఇంటర్వ్యూ అయింది నాగభూషణానికి. ఫలితాలు తర్వాత చెప్తామన్నారు. అంతా మామూలు తంతు.

ఆ రోజు సాయంత్రం వాసు కలిశాడు నాగభూషణానికి. ఉదయం సుధని బస్టాప్‌లో చూసిన సంగతి చెప్పాడు వాసుకి.

వాసు నవ్వి, "సుధ ఓ మెడికల్ కంపెనీలో పనిచేస్తోందిరా. రోజూ బస్సుకోసం అక్కడే నుంచుంటుంది. నీకు తెలీదూ?" అడిగాడు.

వాసుకి నాగభూషణం గురించి బాగా తెల్సు. సుధంటే నాగభూషణానికి ఎంత ఇష్టమో కూడా తెల్సు.

"అయినా ఏం ప్రేమరా నీది? నిజంగా ప్రేమించటం కూడా చాతకాదు. నిజంగా ఎదురుపడి మాట్లాడలేవు ఆడాళ్ళతో. తలొంచుకుంటావు. అసలు వాళ్ళు చేయవలసిన పని. ఛీ! నీ సిగ్గు మగ వాళ్ళకి తలవంపులు. అదికాదురా భూషణం! నువ్వు ఆ అమ్మాయిని చెంపల్లోనుంచి ప్రేమిస్తున్నావ్ అది బాగానే వుంది; ఆ విషయం ఆమెకి తెలియచెప్పాలిగా? ఎప్పుడూ దూరదూరంగా తిరుగుతావు అమ్మాయి అంటేనే.. అసలు ఆడవాళ్ళం టేనే అల్లంత దూరంలో తిరుగుతావని అందరికీ తెల్సు. ఇక ఆ అమ్మాయి నీ ప్రేమ సంగతి ఎలా తెల్సుకుంటుంది" అన్నాడు విసుగ్గా.

వాసు చెప్పింది నిజమే అనిపించింది నాగ భూషణానికి. కానీ ప్రేమని తెలియజెప్పడం ఎలా?

వాసు చెప్పేదేవిటంటే..ముందు అమ్మా యితో మాటలు సాగించాలి. తర్వాత మాటలు వాటికంతట అవే పెరిగిపోతాయి అంటాడు. కానీ ఎలా మాట్లాడాలి, ఏం, మాట్లాడాలి? ఒకవేళ ఎదురుపడిందే అను కుందాం. పలకరించాలి. ఏమని? పలక రింపుకు కూడా సమయం సందర్భం ఉండాలి. ఏవీ లేకుండా ఎలా మాట్లాడ్డం? ప్రేమించడం సులువే, కానీ ప్రేమని తెలియపరచుకోడం చాలా కష్టం. ఇక తను ధైర్యం చేసి మాట్లాడినా ఎక్కడ మాట్లా డుతాడు? ఆ బస్టాప్‌లోనేనా? అంత మంది జనంలోనా? లాభంలేదు. తను అంత ధైర్యం చేయలేడు.' నాగభూషణం మదన పడ్డాడు.

నాగభూషణం బాధ ఒక్కటే. అతనికి

సుధంటే రెండేళ్లనుంచి ఇష్టమే. కాని అది తెలుపుకోడం ఎలా? 'ఆడవాళ్లకి చాలా సున్నితమైన హృదయం ఉంటుంది. ప్రతి చిన్న విషయానికి బాధపడే తత్వం వాళ్లది.' ఇది నాగభూషణం అభిప్రాయం.

'కాబట్టి వాళ్లకి ఇష్టంలేని పని చేయ కూడదు. తను ఆమెని పలకరించడం ఇష్టమో కష్టమో? ఒకవేళ ఏదో చనువుగా పలకరిస్తే ఆ బస్టాప్‌లో జనం అంతా మా ఇద్దరి కేసి చూస్తారు. సుధ సిగ్గుపడుతుంది. అవమానంగా భావిస్తుంది.. అప్పుడు ఆమె దృష్టిలో తను చెడ్డవాడిగా స్థిరపడిపోతాడు. అమ్మో! అలా జరగడం తనకి ఇష్టంలేదు. అందుకనేగా రెండేళ్ల నుంచి సుధ మీద ప్రేమ తనలోనే అణిచి పెట్టుకున్నాడు.నాగభూషణం ఆలోచించాడు.

'ఆ విధంగా తను మంచితనాన్ని కాపాడ్కుంటూ వచ్చాడు రెండేళ్లనుంచి ఆమెని పలకరించకుండా. తన మంచితనమే ఆమెని ఆకర్షించాలి. ఆమే చొరవ తీసుకొని పలకరించాలి. అందుకే తన ప్రేమని తనలోనే అణుచుకోవాలి. తప్పదు మరి! నిట్టూర్చాడు నాగభూషణం.

ఇంటికి వెళ్లిన తర్వాత కూడా సుధను గురించే ఆలోచించాడు.

'సుధ తనతో మాట్లాడకుండా వుంటుందా? తన మంచితనం తెలియదూ? తను ఆడవాళ్ల వెంటపడడు. ఈలలు వేయడు. అల్లరి చేయడు. చొరవ తీసుకొని మాట్లాడడు. ఇవన్నీ సుధకి తెల్సు. 'కాని కాలం కలిసిరావాలి' నిట్టూర్చి నిద్రపోయాడు నాగభూషణం.

మరునాడు నాగభూషణం బస్టాప్‌కి బయలుదేరాడు. అక్కడ ఉన్న సుధని చూశాడు. అక్కడే వున్న ఓ కొట్టులో ఏదో కొని మళ్లీ తిరిగి వచ్చేశాడు.

'సుధకి తను రోజూ కనిపిస్తుండాలి. లేకపోతే తన మంచితనం ఎలా తెలుస్తుంది మరి? కనీసం పావుగంటైనా ఆమె ప్రక్కన ఉండాలి. ఎప్పుడో ఒకప్పుడు పలకరించక పోదు. కానీ రోజూ బస్టాప్‌కి వెళ్లి ఆమెతో పాటు నుంచొని మళ్లీ బస్సెక్కకుండా తను తిరిగివచ్చేస్తే సుధ మరోలా భావించదూ? ఆమె కోసమే తను వస్తున్నట్టు ఆమె వెంట పడుతున్నట్టూ తెల్సుకొని ఛీ-రోడ్ వెధవలా తయారయ్యాడు' అని అనుకోదూ? ఆ దెబ్బతో తన రెండేళ్ల ప్రేమ రెంటికి ప్రక్కలైపోతుంది. అలాకాదు. తను కూడా ఆమె ఆఫీసున్న పరిసరాల్లోనే తనూ ఒక ఉద్యోగం చేస్తుండాలి. అప్పుడు తను వెంట బడినట్టు అవదు. తనూ ఆఫీసు కెళుతున్నాడు అంతే!'

పై ఆలోచన ప్రకారం సుధ ఆఫీసు పరిసరాల్లో ఉద్యోగం సంపాదించడానికి నిశ్చయించుకున్నాడు నాగభూషణం.

మర్నాడు సుధ వచ్చే వేళకు బస్టాప్‌లో నుంచున్నాడు. సుధ మెల్లగా నడచి వస్తుంటే నాగభూషణం మెల్లగా చూసాడు. తర్వాత తన చుట్టూ జనాని కేసి చూస్తున్నాడు తను సుధని చూస్తుండడం

ఎవరైనా గమనిస్తున్నారేమోనని. కాని అంతా సుధ వంకే చూస్తున్నారు. సుధ తలొంచుకొని నుంచొనుంది.

బస్సు వచ్చి ఆగింది. కొంత అలజడి జరిగింతర్వాత సుధ నాగభూషణం బస్సు ఎక్కారు. ఇంకా ఎక్కవలసిన వాళ్ళు చాలా మంది ఉండగానే బస్సు కదిలింది.

'తను అదృష్టవంతుడు' అనుకున్నాడు నాగభూషణం తనకంటే రెండు గజాల దూరంగా ఉన్న సుధని ఒకసారి చూసి.

''ముందుకి జరగండి సార్! ముందుకి జరగండి' అంటూ అరిచాడు కండక్టర్. అంతా కండక్టర్ చెప్పిన విధంగా సర్దుకునే సరికి నాగభూషణం సుధ ముందు నుంచోవాల్సిన అవసరం ఏర్పడింది. అది నాగభూషణానికి చాలా ఇబ్బంది కలిగించింది. సుధని చూడడానికి ధైర్యంలేక పక్కకి తిరిగి నిలబడ్డాడు.

బస్సు ఆగింది. నాగభూషణం గబగబా దిగాడు. అతని వెంటే సుధ కూడా దిగింది.

నాగభూషణం తత్తరపడ్డాడు. కాళ్ళు ఎటు పోవాలో తెలియక తడబడ్డాయి. గబగబా ప్రక్కనే ఉన్న కాఫీ హోటల్లోకి పరుగెట్టాడు. పరుగెత్తినంత పనిచేశాడు.

సుధ మామూలుగా తలొంచుకొని వెళ్ళిపోయింది ఇతనేమీ పట్టించుకోకుండా.

కాసేపటికి తేరుకొని కాఫీ హోటల్లోంచి బయటపడ్డాడు. ఆ ఏరియాలో ఉన్న ప్రతి ఆఫీసులోను ఉద్యోగం కోసం అడిగాడు నాగభూషణం. అంతా నోరు చప్పరించారు. కానీ, సుధ ఆఫీసు కనిపెట్టగలిగాడు.

ఆరోజు రాత్రి నిద్రపోయే ముందు మళ్ళీ ఆలోచించాడు.

'తనకి అక్కడ ఉద్యోగం దొరకలేదు ఇక తర్వాత కర్తవ్యం ఏమిటి? కాలేజీలో చదివే రోజుల్లోకన్నా ఈ వారంరోజుల్నుంచి సుధ మీద తనకి బాగా పిచ్చి పట్టుకుంది. ఆమె పలకరిస్తేకాని తన బాధ తీరేలా లేదు.. అయితే ఇకనుంచి, సుధతో బసు ప్రయాణం బందేనా? ఇక వేరే మార్గమే లేదా?' ..ఉద్యోగం చేస్తున్నట్టు నటించి రోజూ సుధతో పాటు బస్సెక్కి వెళ్ళొచ్చుగా? అవును. ఈ ఆలోచన బాగుంది నిశ్చింతగా నిద్రపోయాడు నాగభూషణం.

రోజూ సుధతో పాటే బస్సెక్కి వెళ్ళి సుధ దిగినచోటే దిగడం నేర్చుకున్నాడు నాగభూషణం. అతనికి కొద్దిగా ధైర్యం చిక్కింది. అలా చాలారోజులు చేశాడు. కానీ **ఫలితం శూన్యం. ఆమె పలకరించలేదు.**

నాగభూషణానికి నిరాశ ఎక్కువయింది. విసుగు పుట్టింది. 'ఎంతకాలం ఇలా జాగు చెయ్యాలి. తనకి ఆమెని పలకరించేంతటి సాహసంలేదు. ఒకవేళ సాహసంచేసినా తనని అపార్థంచేసుకుంటే తనగతి ఏంకాను? ఇంత కాలం తనుచేస్తున్న ప్రయత్నం ఒక్క సెకనులో ఎగిరిపోవడం తన కిష్టంలేదు.

'ఇలా భయపడుతూనే రెండేళ్ళు గడిపేశాడు తను. ఈ రెండేళ్ళకి ఒక్కమాట కూడాలేదు సుధతో. ఇలాగే ఆమె పలకరిస్తుందని కాసుకొని, కూర్చుంటే... ఆమెకి ఇంకొకళ్ళతో పెళ్ళి అయిపోతుంది. అప్పుడు తను ఏడవాలి.. కాబట్టి ఇప్పుడు తను ఏదో ఒక ఎడ్వెంచర్ చేయాలి. రేపో ఎల్లుండో ఆమెని పలకరించేయాలి.. ఏమని?.. 'మీ ఆఫీసులో ఏవన్నా ఉద్యోగాలు ఖాళీగా ఉన్నాయా అని అడగొచ్చు. ఇందులో ఏంతప్పు లేదు కదా?' అనుకున్నాడు.

మరునాడు పలకరిద్దామని సుధకి దగ్గరిగా వెళ్ళాడు. జనం అంతా తననే చూస్తున్నట్టు గమనించి కలవరపడ్డాడు. నోటి వెంటనుంచి మాట పెగల్లేదు.

బస్సు వచ్చింది. అందరూ బస్సు ఎక్కారు. కానీ నాగభూషణం ఓడిపోయిన వాడిలా నుంచున్నాడు. బస్సు ఎక్కకుండా. అతని కళ్ళ వెంబడి నీళ్ళు రాబోతుండగా ఏదో, నలకపడ్డట్టుగా నటించి చేతి రుమాలుతో కళ్ళు తుడుచుకున్నాడు.

నాగభూషణానికి ఆవేశం పెరిగిపోయింది. బాగా ఆలోచించి చివరికి సుధకి ఒక ఉత్తరం రాయడానికి నిశ్చయించుకున్నాడు. ఎక్కువ మాటలు రాయదల్చుకోలేదు. తెల్లకాగితం తీసాడు.

'సుధగార్కి,

నేను మిమ్మల్ని ప్రేమించాను. మీ ప్రేమ నాకు కావాలి. ఇవ్వగలరా?

నాగభూషణం.

కాయితాన్ని నాలుగు మడతలు పెట్టేసి మర్నాడు ఉదయమే సుధ ఆఫీసు అడ్రసుకి పోస్టు చేశాడు. ఇంటికొచ్చి మళ్ళీ ఆలోచించాడు.

'అయ్యో! ఆవేశంలో తను ఎంతపని చేశాడు? ఓ పరాయి ఆడపిల్లకి ప్రేమలేఖ రాయడమా? ఎంత తప్పు?? తను ఎంత బలహీనుడైపోయ్యాడు. చిన్న పొరపాటు వల్ల తను సుధ మనసులో తను చెడ్డ వాడుగా భావింపబడతాడు. ఇక సుధ మొహం **తను ఎలా చూడగలడు? తనని చూసి** ఎంత అసహ్యించుకోంటుంది? ఆమెని రోజూ చూసే భాగ్యం తను పోగొట్టుకున్నాడు. ఇక విచారించి లాభంలేదు. సుధని మరిచి పోవాలి.'

నాగభూషణం పశ్చాత్తాపపడ్డాడు. మరో రెండు రోజులకే అతను మరో ఊళ్ళోకి వెళ్ళాడు ఉద్యోగ రీత్యా. 'ఉద్యోగం తెప్పించి తను ఈ వూరు వదిలి వెళ్ళడానికి భగవంతుడు తనకు సహాయం చేశాడు' అని దేవుడ్ని తలుచుకున్నాడు.

* * *

బస్సు బెజవాడలో ఆగేసరికి ఆలోచనల్లోంచి తేరుకున్నాడు నాగభూషణం. అందరూ దిగారు. నాగభూషణం, సుధా పిల్లలూ మిగిలారు.

సుధ సామాన్లు పట్టుకొని లేచి నిలబడింది. నాగభూషణం తలొంచుకొని గబగబా దిగిపోయాడు. అతనితో పాటే సుధా పిల్లలూ దిగారు.

''నాగభూషణంగారూ!'' అన్న పిలుపు గబగబా నడుచుకుంటూ వెళుతున్న నాగభూషణాన్ని కట్టేసింది. సుధ అతని దగ్గరి కొచ్చింది.

''మరిచిపోయారా?'' నవ్వింది.

నాగభూషణం తలవంచుకున్నాడు.

''ఇప్పుడు ఎక్కడ వుంటున్నారు?'' అడిగింది చంటాడ్ని సరిగా ఎత్తుకుంటూ.'

చెప్పాడు నాగభూషణం.

''మా ఇల్లు ఇక్కడే. ఓసారి చూసి వెళుదురుగాని రండి'' అంటూ బయలు దేరింది.

నాగభూషణం యాంత్రికంగా కదిలాడు.

'పదేళ్ళ క్రితం బస్టాప్‌లో తను చూసిన సుధేనా?'' అనుమానం వేసింది.

''ఉత్తరం రాయడం తెలుసుగానీ, ఫ్రం ఎడ్రస్ రాయడం తెలీదా?'' నవ్వింది సుధ.

ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు నాగభూషణం. ఏదో కలలా భ్రమించాడు ఆమె పలుకుల్ని.

సుధ అతన్ని ఇంటికి తీసుకువెళ్ళి భర్తకి పరిచయం చేసింది. ఇద్దరి పిల్లలతో, దైవంలాంటి భర్తతో సంసారంలో స్వర్గం అనుభవిస్తున్న సుధని చూసి తృప్తిపడ్డాడు.

'పోనిలే! సుధ తనని ప్రేమించింది. అంతే చాలు' నిట్టూర్చాడు నాగభూషణం.



ఎంత హుందాగ ఉందో అంత గొప్పది

# క్రొత్త ఐదు బ్యాండ్ల




# పోర్టబుల్ ట్రాన్సిస్టర్

# బుష్ ఇటిఆర్.117

( ఇటువంటి ట్రాన్సిస్టరు మరొకటి లేదు )

ఈ గొప్ప క్రొత్త బుష్ ట్రాన్సిస్టరులో స్పష్టమైన శబ్దగ్రహణం కోసం 5 బ్యాండ్లున్నాయి. మరొక్క విశేషము, ప్రపంచములో వేర్వేరు దేశాల్లో మీకు ఇంపైన కార్యక్రమాలను తప్పకుండ వినడానికి, ఆయా దేశాల్లో కాలం తెలిసికోవడానికి వీలుగా అంతర్జాతీయ కాల సూచిక అమర్చబడియున్నది. ఈ రేడియోలో 8 ట్రాన్సిస్టర్లు,



ఒక్క డయోడు, పెద్ద 7"×4" అండాకార హై-క్వాలిటీ స్పీకరు ఉన్నందువలన, ఇది అమోఘంగాపని చేస్తుంది. ఈ దినమే మీకు సమీపంలో నున్న డీలరు దగ్గరకు వెళ్ళి బుష్ ఇటిఆర్. 117 ను పెట్టి వినిపించమని అడగండి... ఇంకా, చక్కని యితర బుష్ రేడియోలను కూడా చూపించమని అడగండి.




## బుష్ ట్రాన్సిస్టర్స్

ముల్‌చందాని ఎలెక్ట్రికల్ అండ్ రేడియో ఇండస్ట్రీస్ లి.
సుఖసాగర్, శాండ్‌హర్స్ట్ బ్రిడ్జ్, బొంబాయి 7
ర్యాంక్ ఆర్గనైజేషన్‌తో సంయోగమయిన కంపెనీ



MRB-13A TEL



"అడుగుజాడలు"లో యన్. టి. రామారావు, జమున

# అడుగుజాడలు

## చిత్రసమీక్ష :

'అ లా ద అం గా గి క అ గు డ
దో మొ లై దం ము పే ధ డు జా. లు.'

పై అక్షరాలు ఎంత పొందికగా వున్నాయో ఈ సినిమాలో 'అడుగుజాడలు' కూడా అంత అందంగాను వున్నాయి. జాడ లేకుండా ముందడుగు వేసే ఇతివృత్తం అడుగు జాడల్లో కనిపిస్తుంది. పైనిచ్చిన అక్షరాలు గనక అర్థం చేసుకున్నట్టయితే కథ క్లైమాక్సులో వూపిరి పీల్చుకోవచ్చు. కథలో ఉత్కంఠత అర్థమైపోతే సినిమా చూడ్డానికంత బావుండదు. అయినా యీపై అక్షరాల్లో మిస్టరీ విడగొడదాం. మొదటి పంక్తిలో మొదటి అక్షరానికి రెండవ పంక్తిలో మొదటి అక్షరం జోడించి, అలానే దానికి మొదటి పంక్తిలో రెండవ అక్షరం రెండవ పంక్తిలో రెండవ అక్షరం వరసగా 'అదొకటి ఇదొకటి' జోడిస్తూ రెండు పంక్తులూ చదివేయండి. మీరు అడుగు జాడలు కథ ఫాలో అయినట్టే.

విజయ్ తాతగారు పద్మశ్రీ ప్రసాద్. విజయ్ తల్లిదండ్రుల గురించి అడక్కండి. అతని జోడు పార్వతి తండ్రిని గురించి అడగండి. ఆయన డాక్టర్ కృష్ణ. ధర్మబుద్ధి, త్యాగశీలత ఆయన గుణాలు. తాతగారి లానే మనవడు విజయ్ కూడా ఆటల్లో మేటి. ఎన్నెన్నో ప్రయిజులు తెస్తూ తాతయ్యను మురిపిస్తూ వుండేవాడు. విజయ్ మోటారు పందాల్లో గెలిచినప్పుడు పార్వతి ఆనందించింది. అయితే అతను టేబుల్ టెన్నిస్‌లో తనతో పోటీచేసి ఓడిపోయినప్పుడు అతని ఆతిధ్యాన్ని స్వీకరించకుండా రుసరుసలాడుతుంది (?) ఆ రుసరుసలాడడం విరుచుకుపడడంగా మారి కథ క్లైమాక్సు వరకు అలానే వుంటుంది.. పార్వతి నెలానైనా వలలో వేసుకోవాలని వ్యర్థప్రయత్నాలు చేస్తూవుంటాడు విజయ్. తాతయ్య అతన్ని ప్రోత్సహిస్తూ చెంప దెబ్బలు కూడా తినమంటూ వుంటాడు. పార్వతికి విజయ్ మీద వ్యామోహం లేదు సరిగదా అతను చేసే పనుల్ని కోపంతో అసహ్యించుకొంటుంది. పార్వతి తండ్రి మరణానికి విజయ్ బ్రతకడానికి కారణం కల్పించడంతోను, ఆమె కళ్ళు పోవడంలో కూడా విజయ్ ప్రమేయం వుండడం చేత అతని మీద కసి మరింతగా ప్రబలిపోతుంది. ఆమె మెప్పుకోలునుకోరి విజయ్‌చేసే పనులన్నీ వృధా అయిపోతాయి. తన మంచితనాన్ని తెలియజెప్పాలని కళ్ళులేని పార్వతికి శేఖర్‌గా పరిచయమై అత్యంత ఆప్తుడైపోతాడు విజయ్. డాక్టర్ కృష్ణ తలపెట్టిన పరిశోధనని తాను పూర్తి చేస్తాడు. డాక్టర్ కృష్ణ డైరీనుంచి తస్కరించిన ఫార్ములా ఆధారంగా పరిశోధన పూర్తి చేశాడనే నెపంతో విజయ్‌ను కమిటీలో నేరస్థుడుగా నిలబెడతారు. ఆ డైరీలో ఏంరాసుందో తెలుసుకుందామని ఎవరికీ అనిపించదు. అది తెలుసుకోకుండానే విచారణ పూర్తవుతుంది. విజయ్‌ను నేరస్థుడుగా నిరూపించడానికి పార్వతి ముఖ్యకారకురాలవుతుంది. డైరీలో ఏంవ్రాసుందో మీతో ఎవరికైనా తెలుసా? అని విజయ్ ప్రశ్నించే సరికి అధ్యక్షునితో సహా అందరూ ఉలిక్కిపడతారు. డైరీలో డాక్టర్ కృష్ణ లోకోపకారమైన కొన్ని నీతుల్ని వ్రాశారు. ఆనీతులు ఎవరికీ అర్థం కాని విధంగా అక్షరాలతో మేజిక్కు చేశారు (?) ఈ మిస్టరీ మీరు మొదటిరెండు పంక్తుల్ని అర్థం చేసుకున్నట్టు విడదీసిన తర్వాత విజయ్ నిర్దోషి అవుతాడు. ఎన్నో నిజాల్ని 'ఒక్కపెట్టున' గ్రహించిన పార్వతి విజయ్‌ను కావలించుకుని ఘొల్లుమంటుంది. పార్వతికి కళ్ళొస్తాయ్. సుఖాంతం. అడుగుజాడలు టైటిల్‌కు సంబంధించిన సరంజామా యిందులో బోలెడుంది. డా. కృష్ణ అడుగుజాడల్లో విజయ్ సేవ చేశాడు. చేస్తాడు. తాతగారి అడుగుజాడల్లో పప్పులో కాలేశాడు. ఎట్సెట్రా.. ఎట్సెట్రా..

ప్రసాద్‌గాను శేఖర్‌గాను పాత్రలో బిగువు లేకపోయినా నటనలో ప్రాణ్యత చూపించారు యన్. టి. రామారావు. పార్వతిగా జమున చక్కని నటన కనబరచారు. డాక్టర్ కృష్ణగా యస్. వి. రంగారావు పాత్రకు ప్రాణం పోశారు. పద్మశ్రీ ప్రసాద్ పాత్రలో జీవంలేదు. రేలంగి ప్రయత్నించారు. చలం, రమాప్రభల పాత్రలకి కథతో సంబంధంలేదు. తమకి సంబంధం లేదు గదా అని ప్రేక్షకుల్ని హాస్యంపాలు చేయకనూ పోలేదు. ఇంకా పద్మశ్రీ నాగయ్య

## అడుగుజాడలు

ముక్కామల, బాలసరస్వతి కూడా తారాగణంలో వున్నారు.

కథ ఎంతమాత్రంగా వుందో, పాటల్లో మాటల్లో వాకచక్యం కూడా అంతంత మాత్రంగానే వుంది. సంగీత రచనతో మెరుగు కనబడినా సాహిత్యం దానితో సమానాంతరం చేసుకుంది. విలువైన తారాగణంతో ఎంతో కృషిచేసి చక్కని కళాఖండాన్ని నిర్మించాలనుకున్న నవజ్యోతి ఫిలిమ్స్ ఆశయం



పుట్టినరోజునాడు పూలగుచ్ఛాలతో జమున.

గొప్పది. చాణక్య ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహించారు. మాస్టర్ వేణు సంగీతం, సముద్రాల(జూ)మాటలు, అన్నయ్య కెమెరా, కృష్ణారావు కళ, మార్తాండ్ కూర్పు, వేణుగోపాల్ నృత్యం నిర్వహించిన ఈ సాంఘిక చిత్రనిర్మాతలు యం. సాంబశివరావు, జి. వందనం. ప్రేక్షకుల విభిన్న అభిరుచుల్ని అవగాహన చేసుకుని తీసిన చిత్రం గనుక ప్రజాదాదాభిమానాన్ని ఆకర్షించవచ్చు.

—సి. కనకాంబరరాజు ●

# నటి నర్తకి సంధ్యారాణి

— మోహన్ కుమార్



అందరినీ ఆకట్టుకోగల చిరునవ్వు

అవకాశం అందరికీ అందుబాటులో ఉండదు. అందివచ్చిన అవకాశాన్ని విని యోగించుకోకుండా నిరాకరిస్తే అది మళ్లీ రావటం అరుదు. సంధ్యారాణి తన విషయంలో యీ సూత్రం సత్యం కాదని రుజూ చేసింది. 1963లోనే సంధ్యకు సినిమాలో నటించే అవకాశం వస్తే, దాన్ని ఆమె తండ్రి కాదన్నారు. అయినా అవకాశమూ, అదృష్టమూ కుమారి సంధ్యారాణిని వదల్లేదు. ఆ రెండూ కలసి ఆమెను సినిమాతారను చేసినవి.

* * *

కుమారి సంధ్యారాణి శ్రీ షి. ఎల్. నాయుడు, శ్రీమతి చిన్మయ్ దంపతులకు 1947 మార్చి 9న పాట్నాలో జన్మించింది. ప్రాథమిక విద్య అంతా విజయవాడలోని ఏట్కిన్సన్ సేక్రెట్‌హార్ట్ కాన్వెంటులో జరిగింది. ఆ తర్వాత మెట్రిక్యులేషన్ పరీక్షకు కూచుని పాసయి, గుంటూరు వుమెన్స్ కాలేజీలో చేరింది. కాలేజీలో చదువుతున్న రోజుల్లో నాటకాల్లో పాల్గొనేది. నృత్యాలు చేస్తూండేది. కొన్ని నృత్యాలకు దర్శకత్వం వహించడం కూడ జరుగుతూ ఉండేది. నృత్యాలు అయిదో ఏటి నుంచే నేర్చుకున్నది. శ్రీ మనోహర్ శిక్షణలో నృత్యాల్లో చక్కని శిక్షణ పొందింది.

సంధ్య బి.యస్‌సి. చదువుతూండగా ఓ రోజున పేపర్లో — ప్రఖ్యాత నటుడు, దర్శక నిర్మాత అయిన కిశోర్‌సాహు ఒక ప్రకటన వేశారు. తను తీయబోయే కొత్త చిత్రంలోకి ఉత్సాహంఉన్న కొత్త నటీనటులు కావాలనే ప్రకటన అది. దాన్ని చూసిన సంధ్యకు సినిమాల మీదకు మనసు పోయింది. వెంటనే ఎవరికీ తెలీకుండా ఫోటోలు తీయించుకుని, వాటిని శ్రీ కిశోర్‌సాహుకు పంపించింది. ఇంటర్వ్యూకి రమ్మని కొద్ది రోజుల తర్వాత ఆయన నుంచి లేఖ వచ్చింది. తల్లీ తండ్రీ ఇందుకు అభ్యంతరం తెలిపారు. అమ్మాయి గట్టి పట్టుదలను కాదనలేక— నాయుడు గారు బొంబాయి వెళ్తున్నప్పుడు కుమార్తెను కూడా తీసుకు వెళ్లారు. ఇంటర్వ్యూకి చివరి తేదీ 7. వారు కిసోర్‌సాహూను కలుసుకొన్న తేదీ 12. "ముందుగా వచ్చి వుంటే తప్పకుండా అవకాశం యిచ్చేవాణ్ణమ్మా! టైమ్ అయిపోయింది. వేరొకర్ని బుక్‌చేశాను. నా తర్వాత చిత్రంలో తప్పక యిస్తాను" అన్నారు. అందుకో సంధ్య తండ్రి ఒప్పుకోలేదు. యింటికి వచ్చేశారు. తిరిగి కాలేజీలో చేరింది సంధ్య. ఒకసారి సినిమాల మీదకు దృష్టి పోయిం తర్వాత, మళ్లీ చదువు మీదకు మళ్లుతుందా? ఇక చదివి లాభంలేదని నిశ్చ

యింమేకుని కాలేజీ జీవితానికి స్వస్తి చెప్పింది. అటు పిమ్మట శ్రీ పి. వెంకటేశ్వర రావు (తేనె మనసులు ఫేమ్) వారింటికి వచ్చి— శ్రీ ఆదుర్తి సుబ్బారావుగారు కొత్త వారితో చిత్రం తీయాలను కుంటున్నారని, మంచి ఫామిలీగర్ల్స్ ఎవరైనా ఉంటే తీసుకు రమ్మన్నారనీ చెప్పి— సంధ్య ఫోటోలు తీసుకు వెళ్లారు మద్రాసు. తర్వాత సుబ్బారావు గారి నుంచి పిలుపు వచ్చింది.

అపై జరిగిన విషయాలు మీకు తెలిసినవే. తేనెమనసులు సంధ్య తొలి చిత్రమనీ, కన్నెమనసులు ఆమె మలి చిత్రమనీ కూడా మీకు తెలుసు. కన్నె మనసుల్లోని పతాక సన్నివేశాలలో కుమారి సంధ్యారాణి అద్భుత మయిన నటన ప్రద ర్శించి అందరి మెప్పూ అందుకున్నది. ఆ భూమికలో సంధ్య నటించింది అనటం కంటే జీవించింది అనటం సమంజసంగా ఉంటుందేమో!

సంధ్యారాణికి నటించాలనే ఆసక్తి, ఉత్సాహం, తపన ఉన్నవి. నాట్యంలో ప్రావీణ్యం, నటనలో అనుభవం వున్న సంధ్యను ప్రోత్సహించి అవకాశాలు కల్పించ వలసిన బాధ్యత నిర్మాతలపై ఉన్నది. అన్నట్టు సంధ్య పియానో చక్కగా వాయి స్తుంది. కమ్మని కంఠం కూడా వుంది. బాగా పాడుతుంది.

సంధ్యది చక్కని విగ్రహం. విశాలమయిన ఫాలభాగం, పెద్ద పెద్ద కన్నులు అందరినీ ఆకర్షించి ఆకట్టుకోగల చిరునవ్వు —— సంధ్య అందానికి ప్రత్యేకతలు. ఎప్పుడూ చిలిపిగా నవ్వుతూ, చలాకీగా మాట్లాడుతూ ఉషారుగా ఉండటం ఆమె స్వభావం. పరిశీ లించి చూస్తే సంధ్య వదనంలో అమాయ కత్వమూ, నైర్మల్యమూ స్పష్టంగా గోచ రిస్తాయి.

సంధ్యారాణికి పాకశాస్త్రంలో కూడ ప్రావీణ్యత ఉన్నది. ఇంట్లో వంట తనే స్వయంగా చేస్తుంది. అలా చేసుకు తినడంలో ఎంతో ఆనందం వుంటుందని కూడ అంటుంది. ఆమెకు తెలుగు, తమిళం, హిందీ, బెంగాలీ, ఇంగ్లీ భాషలతో చక్కటి పరిచయం ఉన్నది. ఈ పంచ భాషలూ సంధ్యకు రాయనూ, చదువనూ, మాట్లా డనూ వచ్చు.

ఇంట్లో తీరికగా ఉన్నప్పుడు పుస్తకాలు చదువుకోవడం, అల్లికలు, కుట్టుపనులు చేసుకోవడం, రేడియోగ్రామ్ వేసుకుని రికార్డులు వింటూ కూచోవడం ఆమెకు యిష్టాలు. ప్రస్తుతం సంధ్యారాణి మధు పిక్చర్స్ వారి జానపద చిత్రంలో నటి స్తున్నది. కొత్తగా ఆరంభించ బోతున్న మరి రెండు సంస్థల చిత్రాలలో కూడ సంధ్య ఉండగలదని తెలుస్తున్నది. అంద చందాలు, చదువు, సంస్కారం, నటన, నాట్యం — అన్నీ వున్న సంధ్యారాణిని చక్కని వేషాలు యిచ్చి ప్రోత్సహించడంలో ఎంతో అర్థం ఉంటుంది.



అమాయకత్వమూ - నైర్మల్యమూ



అనంతపురం సభలో శ్రీ ఆదుర్తితో



'శ్రీ కృష్ణ మహిమ'లో కాంతారావు, టి. కె. స్వామి, యస్. ఆర్. ఆంజనేయులు



"భూలోకంలో యమలోకం"లో రాజశ్రీ

# చిత్రలహరి

## పూలరంగడు

అన్నపూర్ణా వారి "పూలరంగడు" చిత్రంలో నాగేశ్వరరావు, శోభన్‌బాబు, గుమ్మడి, చలం, జమున, విజయనిర్మల ముఖ్యభూమికలు పోషిస్తారు. ఈ చిత్రం తాలూకు పూర్తి సాంకేతికవర్గం వివరాలివి: కథ: ముళ్ళపూడి వెంకటరమణ, సంభాషణలు: ముప్పాళ రంగనాయకమ్మ, గీతాలు: సి. నారాయణ రెడ్డి, దాశరధి, కొసరాజు, సంగీతం: ఎస్. రాజేశ్వరరావు, కెమెరా: సెల్వరాజ్, దర్శకుడు: ఆదుర్తి సుబ్బారావు. ఈ నెలలో నాలుగు పాటలు రికార్డ్ చేసి, అవుట్‌డోర్ షూటింగుతో చిత్రనిర్మాణం ప్రారంభమవుతుంది. అక్టోబరు 30 నుంచి నవంబరు 10 వరకూ కొనసాగే యీ షెడ్యూలుతో నాగేశ్వరరావు, జమున, శోభన్‌బాబు,విజయ నిర్మల పాల్గొన గలరని నిర్మాత శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు చెప్పారు.స్టూడియో: శ్రీ సారధి, హైదరాబాద్.



"మన ప్రేమమందిరం"లో సావిత్రి, బేబి శాంతికళ, ఝాన్సీ

## ఏ. వి. యం. తెలుగు చిత్రాలు

ఏ. వి. యం. వారు యిపుడు మూడు తెలుగు చిత్రాలు నిర్మిస్తున్నారు. ఇటీవల విడుదలయిన వారి "లేత మనసులు" చిత్రం విజయవంతంగా సాగుతున్నది. ఈ సంవత్సరం యింతవరకు తమిళనాడులో శత దినోత్సవాలు జరుపుకున్న అయిదు చిత్రాల లోను మూడు ఏ. వి. యం. వారివే కావడం గమనించదగ్గ సంగతి. ఇపుడువారు తెలుగులో నిర్మిస్తున్న మూడు చిత్రాలలో ఒకటి "భక్తప్రహ్లాద", పౌరాణికం. రంగులలో నిర్మించబడుతున్నది. మిగిలిన రెండూ సాంఘికాలు. ఒకటి "అవేకళ్ళు" మరొకటి "రాము."

## భ క్త ప్ర హ్లా ద

చాలాభాగం పూర్తయింది. బేబీ రోజారమణి ఇందులో ప్రహ్లాద భూమికను పోషిస్తున్నది. అయిదేళ్ళు పూర్తిగా నిండని యీ బాలిక అపూర్వ నటన ప్రేక్షకులను ఆశ్చర్య చకితులను చేస్తుంది. హిరణ్యకశిపుడు యస్. వి. రంగారావు. లీలావతి అంజలీదేవి. గురుపుత్రులు రేలంగి, పద్మనాభం, సేవకులు వాళ్ళుగా రమణారెడ్డి, కనకం, సంగీతంలో విశేషప్రజ్ఞ సంతరించుకున్న మంగళంపల్లి బాలమురళీకృష్ణ నారదునిగాను యీ చిత్రంలో నటిస్తున్నారు. సంగీతం: రాజేశ్వరరావు, కెమెరా: విన్సెంట్, దర్శకుడు: చిత్రపు నారాయణ మూర్తి, బి. ఏ.

## అ వే క ళ్ళు

ఇది కూడ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించబడుతున్నది. కృష్ణ, కాంచన, రాజనాల, నాగభూషణం, పుష్పకుమారి, పద్మనాభం, గీతాంజలి. మున్నగువారు నటిస్తున్నారు. దర్శకుడు: ఏ. సి. త్రిలోక్‌చందర్, ఎం. ఏ., మారుతీరావు ఛాయాగ్రహణం, వేదా సంగీతం సమకూర్చుతున్నారు.

## రాము

యన్. టి. రామారావు, కె. ఆర్. విజయ, రేలంగి, పద్మనాభం, నాగభూషణం, గీతాంజలి, మాస్టర్ రాజకుమార్ యీ చిత్రంలో నటించేందుకు యింతవరకు

ఎన్నుకోబడినారు. దర్శకుడు: ఏ. సి. త్రిలోక్‌చందర్.

ఇవిగాక "శ్రీకృష్ణ భగవాన్" (రంగులలో) కూడ నిర్మించగలరని తెలుస్తున్నది. ఈ చిత్రాలన్నిటికీ శ్రీ డి. వి. నరసరాజు రచన చేస్తున్నారు.

## ఉమ్మడి కుటుంబం

రామకృష్ణ యన్. ఏ. టి. కంబైన్స్ వారి "ఉమ్మడి కుటుంబం" చిత్రానికి గత నెలలో రెండు షెడ్యూల్సులో పని జరిగింది. మొదటి షెడ్యూలులో 'లంకాదహనం' 'సావిత్రి' అంతర్నాటకాలు తీశారు. రెండవ షెడ్యూలులో డాక్టరు ముకుందం (ప్రభాకరరెడ్డి), డాక్టర్ పశుపతి (అల్లు రామలింగయ్య) యింటి సెట్లపై చిత్రీకరించారు. యన్. టి. రామారావు, సావిత్రి ఎల్. విజయలక్ష్మి, రాజ్‌బాబు, వాణిశ్రీ, బాలకృష్ణ, ప్రసాద్, ముక్కామల యీ చిత్రీకరణలో పాల్గొన్నారు. ఈ చిత్రంలోని మిగిలిన ముఖ్యభూమికల్లో కృష్ణకుమారి, యస్. వరలక్ష్మి, సూర్యకాంతం, హేమలత, రేలంగి, నాగభూషణం, సత్యనారాయణ ఉన్నారు. దర్శకుడు: యోగానంద్, నిర్మాత: యన్. త్రివిక్రమరావు.

## సత్యమేజయం

కొండల మధ్య అందమయిన సరోవరం. ప్రకృతి సౌందర్యం అడుగడుగునా నిండి మనసుకు ఆహ్లాదం కలిగిస్తున్నది. ఆప్రకృతి రామణీయతకు పరవశ మందుతున్నది మాలా మనసు. ఏవో తీయని తలపులతో తేలిపోతున్నది. సరోవరంలోకి దిగి జలకమాడుతూ అనుభూతుల్ని నెమరు వేసుకుంటున్నది. కలకాలం యీ ఆనందమంతా యిలా తనలో ఉండిపోతే?... ఆలోచిస్తూ పైకి వచ్చి దుస్తులు తీసుకోబోతున్నంతలో పెద్ద ఎలుగుబంటి వొకటి వచ్చింది. మీద మీదకు వస్తున్నది. భయంతో కెవ్వున కేక వేసింది. అటే వస్తున్న రాజా ఆమె కేకకు అదరిపడి చూశాడు. విపత్తును గుర్తించి చటుక్కున ఎలుగుబంటి పైకి లంఘించి దానిని హతమార్చాడు. మెరపులా వచ్చి తననీ ఆపదనుండి రక్షించిన ఆ యువకుణ్ణి, అతడి అద్భుత ధైర్యసాహసాలనూ మెచ్చుకుంటూ కన్నార్పకుండా తిలకిస్తున్నది. 'ఆపద నుంచి రక్షించినవాడికి అభివందన చెప్పకపోవడం అగౌరవపరచినట్లు



"ఏక్ కహా జారహా హై"లో హరనాథ్, నీనా

కదూ?" అన్నాడు రాజా ఆమెను ఓర కంటితో చూస్తూ. మాలా సిగ్గుపడి, తలదించుకున్నది. "అబ్బే..కాదండీ, నా వస్త్రాలు అక్కడ ఉన్నాయి. మీరు అడ్డంగా నించున్నారు. ఎలా చెబుదామా అని ఆలోచిస్తున్నా.. మీరు నన్ను కాపాడినందుకు కృతజ్ఞతాంజలి సమర్పించుకొంటున్నా" నన్నది. అతడు వైదొలగాడు. "ఇప్పుడే వస్తాను" అంటూ చెట్టు చాటుకు తప్పుకుంది మాలా. మళ్లీ యిటు రాకుండానే అటు గుహ కేసి వెళ్లిపోయింది. రాజా వెతికాడు. ఎక్కడా కనిపించలేదు. ఏమయి ఉంటుంది? ఆలోచిస్తూ ముందుకి నడిచాడు. ఈ సన్నివేశాన్ని యిటీవల దర్శకుడు శ్రీ పి. వి. రామారావు ఇందిరారమణా పిక్చర్స్‌వారి "సత్యమే జయం" చిత్రానికి గాను అవుట్‌డోర్‌లో చిత్రీకరించారు. చక్కని భంగిమలలో యీ దృశ్యాన్ని తీసిన ఛాయాగ్రాహకుడు కన్నప్ప. రాజశ్రీ, శోభన్‌బాబు పాల్గొన్నారు. నిర్మాత: టి. పి. సుబ్బన్న.



'డాక్టర్ ఆనంద్'లో ఎన్. టి. రామారావు.



'శ్రీమతి'లో శారద.

# చిత్రలహరి

## భువనసుందరి కథలో హేమమాలిని

శ్రీ తోట సుబ్బారావు శ్రీదేవీ ప్రొడక్షన్స్ పేరిట నిర్మిస్తున్న "భువనసుందరికథ"లో ప్రసిద్ధ నర్తకి హేమమాలిని మాయా మోహినిగా నటిస్తున్నది. ఈ అమ్మాయి ప్రస్తుతం ఆర్. కె. ఫిలిమ్స్ మేరానామ్ జోకర్, శ్రీకాంత్ జెమ్స్ సప్నోంకా సౌదాగర్ హిందీ చిత్రాలలో రాజకపూర్ పక్కన నాయకిగా వేస్తున్నది.

భువనసుందరి కథలో ముఖ్యభూమికల్లో యన్. టి. రామారావు, కృష్ణకుమారి,



"డాక్టర్ ఆనంద్"లో కాంచన

ఉదయకుమార్, యన్. వి. రంగారావు, ధూళిపాళ, సత్యన్నారాయణ, ముక్కామల, అల్లురామలింగయ్య, కోళ్ల సత్యం, వాణిశ్రీ, శారద, సబితాదేవి, తిలకం ఉన్నారు. దర్శకుడు: సి. పుల్లయ్య.

## సైరా-దిలీప్‌కుమార్‌ల వివాహం!

ప్రసిద్ధ హిందీ నటీనటులు సైరాబాను, దిలీప్‌కుమార్‌లు వివాహం చేసుకొనగలరన్న వార్త యిక్కడి చిత్రప్రపంచంలోని వారిని ఆశ్చర్యచకితులను చేసింది. ఇంతవరకూ వారి రువురూ కలసి ఏ చిత్రంలోనూ నటించ లేదు.

## వీరపూజ

విజయసారథి ప్రొడక్షన్స్‌వారి "వీర పూజ" చిత్రనిర్మాణం త్వరిత గతిన సాగు



AMRUTANJAN
Gripe Mixture
AMRUTANJAN




## చిత్రలహరి

తున్నది. కాంతారావు, కాంచన, బాలయ్య, పద్మశ్రీ, నాగయ్య, లింగమూర్తి, రేలంగి, బాలకృష్ణ, వేళంగి, వాసంతి, వాణిశ్రీ, జి. వరలక్ష్మి నటిస్తున్నారు. టి. గోపాలకృష్ణ అనే కొత్తనటుడు కూడ యిందులో పాల్గొంటున్నాడు. దర్శకుడు: అమంచర్ల శేషగిరిరావు.

### రతీమన్మథ

ఇందిరా ప్రొడక్షన్స్‌వారి "రతీమన్మథ" చిత్రానికిగాను యిటీవల దర్శకుడు శ్రీ పి. నాగయ్య నాయుడు కొన్ని హాస్యరస దృశ్యాలను చిత్రీకరించారు. కృష్ణకుమారి, కాంతారావు, యస్. వి. రంగారావు, రఘు



"డాక్టర్ ఆనంద్"లో ఎన్. టి. రామారావు, కాంచన.

రామయ్య, అల్లురామలింగయ్య, రాజ్‌బాబు, ఏడిద నాగేశ్వరరావు, ఆదోని లక్ష్మి, శారద, రమాప్రభ, శాంత మున్నగువారు నటిస్తున్నారు. రచన: గబ్బిట వెంకటరావు. ఈ చిత్రం గోల్డెన్ స్టూడియోలో నిర్మించబడుతున్నది.

### వీనస్ అండ్ పద్మినీ కంబైన్స్

వీనస్ అండ్ పద్మిని కంబైన్స్ వారు తెలుగులో ఒక చక్కని సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. అంజలీదేవి, యస్. వి. రంగారావు, కృష్ణ, రామ్మోహన్, భారతి, వాణిశ్రీ యిందులో ముఖ్యభూమికలు పోషిస్తున్నారు. సంభాషణలు: ఆరుద్ర, సంగీతం: కె. వి. మహదేవన్, దర్శకుడు: వి. మధుసూదనరావు.

—మోహన్‌కుమార్

నొప్పితో వున్న
పెద్దవారికి 2 బిళ్లలు
అనాసిన్ ఇవ్వండి.

పిల్లలకు ఒక బిళ్ల చాలు.

ఇది ఎంత
సులభమైన విషయము!

లక్షణములు తల నొప్పి, జలుబులు మరియు ఫ్లూ, పంటి పోటు, ఒళ్లు నొప్పి, కండరముల నొప్పి

ANACIN
FAMILY PACK

అనాసిన్
చాలా మంచిది
ఎందుకనగా అది 4 విధాల పనిజరుపును

Registered user: GEOFFREY MANNERS & COMPANY LIMITED. ASP/GM/AN-4

అవీ-ఇవీ...

# కళత్రం నాటిక ప్రదర్శన

ఇటీవల మద్రాసు వాణీ మహల్‌లో కళత్రం నాటకం ప్రదర్శింప బడింది. రసవత్తరంగా ప్రదర్శింపబడిన ఈ నాటకం ఒక ఫిలిం కళాకారుని సహాయార్థం ఏర్పాటు చేశారు. ఒక తండ్రి అవివేకం చుట్టూ అల్లబడిన కథే అయినా పాత్రధారుల శక్తి ఆ లోటును కప్పిపుచ్చేందుకు ప్రయత్నించింది. "పిచ్చి కూతురుకు పెళ్లి చేస్తాడు తండ్రి. భార్య పిచ్చిదని తెలుసుకున్న ఆ భర్త దేశాల మీద పడతాడు. మరో డాక్టరు ఆమె పిచ్చిని వదిలిస్తాడు. ఆమెను పెళ్లికూడా చేసుకుందామనుకుంటాడు. ఈ లోపులో అసలు భర్తకు జ్ఞానోదయమై తిరిగి వస్తాడు. భార్యాభర్తల మధ్య డాక్టరు సంఘర్షణ! వీటన్నిటి వెనకాల తండ్రి నీడలాగా అంటి పెట్టుకుని తన తెలివి తక్కువతనాన్ని ఆధారంగా చేసుకుని నాటకానికి కథ — కూరుస్తాడు." సుఖాంతమైన ఈ కథలో ముఖ్య పాత్ర తండ్రిది. తండ్రిగా కాశీనాథ్ తాతా చక్కని హావభావాలు ప్రదర్శించారు. చాలా క్లిష్టమైన పాత్రని నేర్పుతో ప్రదర్శించి, ఆ పాత్రకు ప్రాణంపోసి నాటకం రక్తి కట్టడానికి ముఖ్య కారకుడైనాడు. తర్వాత చెప్పుకోదగిన నటన ఆ తండ్రి కూతురు శారదగా వేసిన పి. కృష్ణకుమారిది. శక్తినంతా ధారపోసి పాత్రను పోషించడానికి యత్నించింది. ఆమె భర్త మోహన్‌గా శ్రీధర్ తనపాత్రలో జీవించాడు. డాక్టర్‌గా ఆనంద్‌బాబు సెభాష్ అనిపించుకున్నాడు. ఇంకా హాస్యం కోసం సృష్టించిన పాత్రధారులు మంజుల, హనుమంతరావు కూడా అనుకున్న మేరకు హాస్యాన్ని అందించారు. కొన్ని కొన్నిచోట్ల పోగాపోటీలు వేసుకుని ఈ అరుగురూ ఉత్సాహంగా నటించారు. ఇందుకు రాజశేఖర కళాసమితిని, వారి కృషిని అభినందించాలి. దర్శకుడు శ్రీ కె. రాధాకృష్ణ ప్రతిభ ప్రతిసన్నివేశంలోనూ కనిపించింది. ప్రేక్షకుల మన్నన పొందిన ఈ నాటకానికి సంగీతం శ్రీ డి. బాబూరావు కూర్చారు.

—సికరాజు ●

## 'మిస్ ఏంజెల్ ఫేస్'

పాండ్స్, బొంబేడయింగ్ వారి సహకారంతో ఇటీవల 'ఈవ్స్‌వీక్లీ' ఏర్పాటు చేసిన 'మిస్ ఏంజెల్ ఫేస్' అందాల పోటీలో మద్రాసు ప్రాంతానికి పద్దెనిమిదేళ్ల వడుచు కుమారి షమీలా హెల్లింగ్స్‌వర్త్ ప్రథమ శ్రేణిలో ఎన్నికయింది. మద్రాసు గవర్నరు సర్దార్ ఉజ్జల్‌సింగ్ ఆమె శిరోభూషణాన్ని అలంకరించారు. ఈ పోటీ ద్వితీయ స్థానంలో కుమారి కారొలిన్ బసోన్, తృతీయ స్థానంలో కుమారి రాణి ఆర్ముగం కూడా ఎన్నిక చేయబడ్డారు. అందగత్తెలు ముగ్గురికీ ఆకర్షణీయమైన బహుమతులు పంచబడ్డాయి. బొంబాయి, బెంగుళూరు, మద్రాసు, ఢిల్లీ, కలకత్తాల్లో ప్రాంతీయమైన ఈ 'మిస్ ఏంజెల్ ఫేస్' ఎన్నిక పూర్తి కాగానే బొంబాయి సమావేశంలో వీరినుంచి 'మిస్ ఇండియా', ఎన్నిక జరుగుతుంది.

* * *

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ తిరుమల వేంకటేశ్వరస్వామిపై శ్రీ వి. జి. కె. చారి వ్రాసిన రెండు పాటలను ఇటీవల హెచ్. ఎం. వి. గ్రామఫోను కంపెనీ వారు రికార్డు చేయడం జరిగింది. "అడుగడుగు దండాల వాడా", "శ్రీనివాసా! జగదీశా!" అనే ఈ రెండు పాటలకు సుప్రసిద్ధ సంగీత దర్శకుడు శ్రీ ఎస్. పి. కోదండపాణి స్వరకల్పన చేశారు. శ్రీ పిఠాపురం నాగేశ్వరరావు అత్యంత హృద్యంగా పాడారు. ఈ రికార్డు అక్టోబరు మాసములో విడుదల అవుతుందని తెలుస్తోంది. శ్రీ చారి లోగడ వ్రాసి రికార్డు అయిన "శ్రీ వేంకటేశ్వరునిపై" పాటలు బహుళ ప్రజాదరణము పొందినవి. ●



Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

